

# విషయ సూచిక







# తొలిపలుకు

మన తెలుగుభాషలో బోధనాశాస్త్రమునకు సంబంధించిన పుస్తకము లరుదుగానున్నవి. బోధనాపద్ధతులు, విద్యా మానసిక శాస్త్రము, విద్యాపాత్రముల గురించి కొన్ని గ్రంథము లున్నను, ఇంతవరకు పాశ్చాత్య విద్యాచరిత్రగాని, విద్యాసంస్కర్తల జీవిత చరిత్రగాని ప్రచురింపబడినట్లులేవు. మాధ్యమిక, ఉన్నత శిక్షణా పాఠశాలలలో ప్రణాళికలో నీ విషయము చేర్చబడకుండుటయే యీ లోటునకు హేతువై యుండవచ్చును. కళాశాలలలో శిక్షణ బొందు ఉపాధ్యాయ విద్యార్థులకు మాత్రమే విద్యాచరిత్ర బోధనావిషయముగ నిర్ణయింపబడుటచేత, ఇతర ప్రణాళికా విషయములతోపాటు వారు దీనినిగూడ ఆంగ్లేయభాషలో నభ్యసించు చుందురు. కావున ఆంధ్రభాషలో పాశ్చాత్య విద్యావేత్తల చరిత్ర ప్రచురింప నావశ్యకత కలిగియుండలేదని తోచును.

హైదరాబాదు ప్రభుత్వము నెలకొల్పిన ఓరుగల్లు శిక్షణా పాఠశాలలో నే నైదు సంవత్సరము లధ్యాపకుడుగానుండి మాధ్యమిక, ఉన్నతతరగతుల కీ విషయము బోధించితిని. వారికిది పాఠ్య విషయమగుటచే ఆంగ్లములో రచింపబడిన గ్రంథముల చదివి, వారి భావముల క్రోడీకరించి యుపన్యాసము లిచ్చియుంటిని.

నా వ్రాతప్రతిని, మా మిత్రులును, తోటి యధ్యాపకులు నగు శ్రీ సి. సూర్యనారాయణమూర్తి, యం. యస్‌సి. డిప్. ఇడి. ఉస్మానియా, యమ్. వేదాంతాచార్లు, ఎం. ఎ. (లండన్), ఎం. ఇడి. ఉస్మానియా, గార్లు చూచి ప్రచురించమని నన్ను ప్రోత్సహించిరి. వీరిలో రెండవ వారు నా వ్రాత ప్రతినం

తయు నామూలాగ్రముగా జదివి తమ యమూల్యాభిప్రాయాన్నిచ్చి నన్నీ కార్యమునకు పురిగొల్పిరి. నా మిత్రులగు వీరుభయులకు నా కృతజ్ఞతావందనము లర్పించుచున్నాను.

నా మిత్రులును, కృష్ణాపత్రికా సంపాదకులునగు శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు శ్రమయనక, ప్రతి నంతయు జదివి లోపముల సరిజేసి నా యత్నమునకు దోహదమిచ్చిరి. వారికి నా హృదయపూర్వకమగు కృతజ్ఞతావందనములు.

ఆంగ్లభాషలో విద్యాచరిత్రను రచించిన మన్రో, పాశ్చాత్య విద్యాసంస్కర్తల జీవితములు రచించిన గ్రేవ్స్, రస్కు మొదలగు గ్రంథకర్తల యభిప్రాయముల స్వీకరించుటచే వారి యనుమతి నిందుమూలమున పొందుచు, వారికి కృతజ్ఞతావందనము లర్పించు చున్నాను.

ఈ పొత్తము మాధ్యమిక, ఉన్నత శిక్షణాపాఠశాలలలో నుండు ఉపాధ్యాయ విద్యార్థుల ప్రణాళిక ననుసరించి వ్రాయబడు టచే వారి కుపయుక్తముగా నుండును. ఇది నా ప్రథమ యత్న మగుటవలన, విషయజ్ఞు లిందలి లోపముల నా కెరింగించి నన్ను కృతార్థుని జేయ ప్రార్థన.

ఉన్నతపాఠశాల
చెన్నూరు.
8-11-50

మద్దూరి సత్యనారాయణమూర్తి,
గ్రంథకర్త.

# కమీనియస్.

## క్రీ. శ. 1592—1671

బాల్యము, విద్యాభ్యాసము

కమీనియస్ మొరేవియాలోని నివినిట్జ్ (Nivinitz) అను గ్రామములో జన్మించెను. ఇతడు ప్రొటెస్టెంటుశాఖకు చెందిన క్రైస్తవుడు. చిన్నతనమందు ఇతని తలిదండ్రుల అశ్రద్ధవలన 16 సంవత్సరములవయస్సు వచ్చునంతవరకు లాటిన్ (Latin) భాషాభ్యాసము ప్రారంభించలేదు. ఆ కాలమున ప్రణాళికలో లాటిన్ భాషకు చాలప్రాముఖ్యముండెడిది. లాటిన్ భాషను వయసు వచ్చిన పిమ్మట నేర్వమొదలిడుటచేత ఆ భాషలోని బోధనా పద్ధతుల లోపములు అతడు గ్రహించెను. అప్పటినుండియు బోధనాపద్ధతులను సంస్కరించవలెనని అతడు నిశ్చయించుకొనెను. లాటిన్ పాఠశాలలో విద్యను పూర్తిచేసి రెండు సంవత్సరములు హెర్బారన్ (Herbarn) లోని కళాశాలలో ఉన్నతవిద్య నేర్చెను. అటుతర్వాత హిడెన్‌బర్గ్ (Heidenberg) విశ్వవిద్యాలయములో మత సంబంధమైనవిద్య నభ్యసించెను. అప్పటికిని వయస్సున చిన్నవాడే గావున నాల్గు సంవత్సరములు మొరేవియాలోని "ప్రెరో" పాఠశాలలో ఉపాధ్యాయుడుగా నుండెను. అక్కడ పనిచేయుచుండినప్పుడు అతను లాటిన్ భాషను సులువుగా బోధించుటకై "సులభవ్యాకరణ సూత్రములు" (Precepts of Easier Grammar) అను పుస్తకమును వ్రాసెను. తరువాత మూడు సంవత్సరములు మత ప్రచారకుడుగా నుండెను. యూరప్‌లో ఆ కాలమున జరుగుచున్న 30 సంవత్సరముల యుద్ధమువలన

పెక్కు బాధ లనుభవించి చిట్టచివరకు పోలెండ్‌లోనున్న "లెస్జినో" (Leszno) అను పట్టణమున వసింప మొదలిడెను.

వాచకములు, గ్రంథములు

అతడు లెస్జినోలో నుండగా విద్యావిధానమునకు ఉపయుక్తమగు వాచకములు, పుస్తకములు రచించెను. అట్టి వానిలో మొదటిది "భాషా కవాటోద్ఘాటము" (Gate of Languages Unlocked). ఇది లాటిన్ భాషాభ్యాసమునకు ప్రవేశిక వంటిది. నిత్య వ్యవహారమందలి అనేక వస్తువులను భావములను తెలుపు వేల కొలది లాటిన్ పదముల ఉపయోగమునకు లక్ష్యములుగా వాక్యములా గ్రంథమున రచింపబడెను. ఈ వాచకములో కుడివైపున లాటిన్ పదములును, ఎడమవైపున వాటికి తుల్యమైన మాతృభాషా పదములును, ముద్రింపబడినవి. ఈ వాచకములు చదువుటవలన విద్యార్థికి, సామాన్యజ్ఞానము లభించుటయేగాక లాటిన్ పదములతోగూడ పరిచయము కలిగెను.

భాషాకవాటోద్ఘాటనము లాటిన్ ప్రారంభించు వారికి చాలా కఠినముగా నున్నదని కమీనియస్ తెలిసికొని రెండు సంవత్సరముల తర్వాత "నడవ" (Vestibule) అను మఱొక గ్రంథము వ్రాసెను. మొదటి పుస్తకములో చేర్చిన వేలసంఖ్య గల పదములను తగ్గించి, "నడవ"లో కొన్ని వందల లాటిన్ పదములను చేర్చెను. ఈ రెండు వాచకములను చాల పర్యాయములు పరిశీలించి సవరణలుచేసెను. వీటికి తగిన వ్యాకరణములు నిఘంటువులుగూడ ప్రచురించెను.

కమీనియస్ కారణాంతరములచేత "ఎల్బింగ్" అను పట్టణములో వసింప మొదలుపెట్టెను. ఇదివరకు తాను రచించిన రెండు వాచకములను పరిశీలించి "సావిడి" "Entrance Hall" అను మూడవ వాచకమును ప్రచురించెను. నాలుగవ వాచక

మును ప్రచురింప యత్నించెనుగాని కృతార్థుడు కాలేదు. "పాటక్" "Patak" అను గ్రామములో నున్నపుడు రెండు ఉపవాచకములను వ్రాసెను. అందులో మొదటిది The World of Sense Objects Pictured, (విషయ ప్రపంచ చిత్రీకరణము.) రెండవది "School Plays" పాఠశాల ఆటలు.

మొదటి ఉపవాచకములో కమీనియస్ తన ఇంద్రియవాస్తవ జ్ఞానసూత్రములను పూర్తిగవర్తింపజేసెను. అది రెండు శతాబ్దముల వరకు కమీనియస్‌యొక్క సూత్రములని పేరువడసెను. అది భాషాకవాటోద్ఘాటము అనెడి గ్రంథముయొక్క పునర్ముద్రణయే. దానిలో వస్తువులయొక్క చిత్తరువులుకూడ ముద్రింపబడెను. చిత్తరువులజేర్చి ముద్రింపబడిన వాచకములలో ఇదియే మొట్ట మొదటిది.

మహోపదేశము

కమీనియస్ విద్యావిషయముమీద అభిప్రాయములను ఈ పుస్తకరూపమున 1632 లో ప్రచురించెను. అతను తన జీవితమంతయు లాటిన్ భాషను బోధించుట కుపయుక్తమగు వాచకములను వ్రాయుటలోను బోధనాపద్ధతులను పరిశోధించుటలోను గడిపెను. మహోపదేశము కేవలము స్వతంత్ర గ్రంథము కాక పోయినను ఇంద్రియ వాస్తవజ్ఞాన ప్రతిపాదనలో "Sense Realism" లోనున్న ఉత్తమలక్షణములన్నియు దీనిలోనున్నవి. ఇది మొరేవియన్ భాషలో వ్రాయబడినది. అతడు రచించిన ఇతర పుస్తకములన్నియు ఈ మహోపదేశములోని అభిప్రాయములను విస్తరింప జేయుటకై వ్రాయబడినవే.

ఈ గ్రంథములో వివరింపబడిన అభిప్రాయములు ఈ క్రింద వ్రాయబడినవి.

పసివారి కందరికిని విద్య నేర్పవలెను. బీదసాదలను భేదము లేకుండ బాల బాలికల నందరిని అన్నిపట్టణములలోను గ్రామముల లోను పాఠశాలలకు పంపవలెను. వారిని జ్ఞానవంతులుగను గుణ వంతులుగను దైవభక్తిపరులుగను జేయు విషయములన్నియు బోధింపవలెను. అన్ని కళలలో శాస్త్రములలో నైపుణ్యము కలుగునప్పటికి ప్రపంచములోని ముఖ్యవిషయములను వాటి కార ణములను వాని ఉపయోగములను బాలురకు తప్పక తెలుప వలెను. బాలురకు విద్య ఇంటివద్దకంటె పాఠశాలలో నేర్పుట ఉచితము. వారందరిని తరగతులలో చేర్చి విద్య గరపిన యెడల వారు ఒకరి నొకరు అనుకరించుచు, మించుటకుగూడ యత్నిం తురు. బాలురకు శాస్త్రములు, కళలు నేర్పి జ్ఞానము కలుగ జేయుట, భాషలను బోధించుట ఋజువర్తనము, నీతి, భగవద్భక్తి కలుగజేయుటయె పాఠశాలయొక్క ముఖ్యకర్తవ్యము. ఆకాలపు పాఠశాలలు కమీనియస్ యొక్క ఆదర్శములను తృప్తిపరచలేక పోయినందున నిజాభీష్టసిద్ధికై ఒక పాఠశాలను స్థాపించి ఈ క్రింది ప్రయోజనములు సాధింప తలంచెను. బాలురందరు విద్యనేర్తురు. జ్ఞానము, నీతి అలవడజేయువిషయములు బోధింపవచ్చును. ఎట్టి నిర్బంధము, కఠినశిక్ష ఇవ్వకయే ఆహ్లాదకరముగ, ప్రకృతిసిద్ధముగ విద్య నేర్పవీలగును. విద్యకును జీవితమునకును సంబంధము కలుగ జేయవచ్చును. బూటకముగాక నిజమైనట్టియు సంపూర్ణమై నట్టియు విద్యగరప వీలగును. విద్యావిధానము సులభముగ నుండు నట్లు చేయవచ్చును. ప్రతిరోజు నాలుగు గంటలు మాత్రమే తరగతిలో ఉపాధ్యాయుడు పనిచేయుచు వందమంది విద్యార్థులకు విద్య నేర్పుటకు వీలగు విధానము అవలంబించవచ్చును.

పైన ఉదహరించిన ఆశయములను సిద్ధింపజేయుటకు పాఠ శాలలు క్రమమైన పద్ధతి ననుసరించి నడుపబడవలెను. ఆ పాఠ శాలలు కాలనిర్ణయము విషయనిర్ణయము బోధనాపద్ధతి దృష్టియుం

దుంచుకొనవలెను. ప్రకృతి ననుసరించవలెను. ప్రకృతి వ్యాపారములన్నియు నిర్ణీతకాలములో జరుగుచుండును. దానినిచూచి, తోటమాలి మొక్కలను సకాలమున నాటును. ఇదే రీతిగ సృష్టిలోని జంతువులు పక్షులుగూడ నిర్ణీత కాలములోనే తమ పనులను చక్కబెట్టుకొనును. కావున విద్యకూడ ప్రకృతిలో వలెనే వసంతమువంటి బాల్యమందే ప్రారంభింపవలెను. ప్రాతః కాల ఘడియలే విద్యాభ్యాసమునకు తగినవి. బాలుర వయస్సు ననుసరించి విషయనిర్ణయము చేయవలయును. పెక్కు విషయములను ఒకే సమయమందు బోధింపరాదు. బోధింపబడు విషయములలో క్రమముండవలెను. సంవత్సరములో బోధింపవలసిన విషయములను పూర్తి జేయుటకు కాలనిర్ణయపట్టిక తయారుచేయవలెను. బాలుర కుపయుక్తమగు పుస్తకములను ఉపకరణములను సేకరించవలెను.

మాతృపాఠశాలకు మార్గదర్శి

ఇంటిలో పసిబాలురకు విద్యను బోధించు విధానమును గురించి కమీనియస్ తన యభిప్రాయములను ప్రచురించెను.

లాటిన్ భాషలో వాచకములను రచించిన విధముననే తన దేశభాష లేక మాతృభాషయైన మొరేవియన్ భాషలోగూడ కొన్ని వాచకములను రచించెను. కాని అవి అంత ప్రజాదరణ పొందలేదు.

విద్యను నేర్పుటలో గల త్రివిధమైన ఉద్దేశ్యములు.

కమీనియస్ జీవితముయొక్క పరమావధిని గ్రహించి దాని కనుగుణముగా విద్యాదర్శములు లేక ఉద్దేశ్యములను నిర్వచించెను. అతడు విద్యకును మతమునకును సంబంధము కలుగజేసి మానవజాతిని సంస్కరింపగోరెను. సృష్టిలో మానవుడు సర్వోత్కృష్టుడనియు, జీవిత పరమావధి ఈ జన్మాంతరమున

ప్రారంభమగుననియు, ఇహజీవితము ఆ పరమావధికి మానవుని సిద్ధపరచుననియు, విద్యవలననే మానవుడు ఆత్మజ్ఞానమును పొందుననియు, ఈ మొదలగు అభిప్రాయము లాతని కుండెను. జ్ఞానము, శీలము, భక్తి - ఈ మూడును విద్యయొక్క ముఖ్యోద్దేశ్యములుగా నిర్ణయించెను. మానవునిలోనుండు పశుత్వమును పోగొట్టి నీచ ప్రవృత్తులను పారద్రోలి ఉత్తమ స్వభావమును కలుగజేయుటకై మానసిక, నైతిక శిక్షణ అవసరమనియు అట్టి శిక్షణ విద్యవలన సమకూరుననియు కమీనియస్ తలంచెను. విద్యనేర్పుట ఉదర పోషణ నిమిత్తమైకాదనియు మానవత్వమును పెంపొందజేయుటయే యనియు అతడు వక్కాణించెను.

అతడు రచించిన మహోపదేశములో పైన వివరించిన ఆదర్శములేగాక బాలురకు విశ్వవస్తు జ్ఞానావశ్యకతనుగూడ ఉద్ఘాటించెను. ప్రతి బాలునికిని ప్రపంచములోని వస్తువు లన్నింటిని గురించి స్వల్పముగా జ్ఞానమును పరిచయమును కలుగజేయుట అవసరము. అతను రచించిన అన్ని పుస్తకములలో ఈ అభిప్రాయమే కానబడును. పాఠశాలలలోనేగాక కళాశాలలలోగూడ అన్ని వస్తువులను గురించి బోధింపవలెననియు కళాశాలలలో శాస్త్రపరిశోధనలకై ప్రత్యేక ఏర్పాట్లుండవలయుననియు అతని సంకల్పము.

**కమీనియస్ పాఠశాల నిర్వాహణము.**

బాలుర మానసిక పరిస్థితుల ననుసరించి పాఠశాలలను నాలుగు విధములుగా నాతడు విభజించెను. 1 నుండి 6 సం. వారికి శిశు పాఠశాల ప్రత్యేకించెను. 6 నుండి 12 సం. వారికి ప్రాథమిక పాఠశాల అని నియమించెను. దానిలో విద్య మాతృభాషలో నేర్పవలెను. 12 నుండి 18 సం. వరకుండు యువకులకు ఉన్నత పాఠశాల ఏర్పాటుచేసి లాటిన్ భాషద్వారా విద్య నేర్పవలెనని అనెను. 18 నుండి 24 సం. వఱకు కళాశాలలో విద్య

నేర్పవలెను. విద్యతోపాటు అనుభవజ్ఞానము కలుగజేయుటకై దేశ యాత్ర నిర్బంధము చేసెను. ఈ విధముగా ప్రతి ఇంటిలో శిశు పాఠశాల, ప్రతి గ్రామములో ప్రాథమిక పాఠశాల, ప్రతిపట్టణ ములో ఉన్నత పాఠశాల, ప్రతి రాష్ట్రములో కళాశాలయుండుట అవసరమని అతడు సూచించెను.

మొదటి రెండు రకముల పాఠశాలలలో విద్య మాతృభాష లోను, తక్కిన రెంటిలో లాటిన్ భాషలోను బోధింపవలెను. ఉన్నతపాఠశాలలలో వృత్తివిద్య నేర్చుకొనగోరువారికి సామాన్య విద్య సంపూర్తిగ నేర్పవలెను. విశ్వవిద్యాలయములలో అధ్యా పకవృత్తికి, మతవ్యాప్తికి దేశసేవకు వలయు విద్య నేర్పవలెను. మిక్కిలి జ్ఞానవంతులు, విశేషప్రజ్ఞావంతులు మాత్రమే విశ్వ విద్యాలయములో విద్య నభ్యసింపనీయవలయును. ఉన్నత పాఠ శాలలలో కృతార్థులైనవారు నేర్చుకొనవలసిన వృత్తి లేక అభ్య సింపవలసిన విద్య ఉపాధ్యాయులే నిర్ణయింపవలెను. విశ్వవిద్యా లయములో చేరినవారు వారి వారి శక్తి సామర్థ్యములనుబట్టి మతము, రాజనీతి, వైద్యము—ఈ శాస్త్రములలో ఏదోయొకటి వరించి, దానియందు పారీణత పొందవలెను. యువకుల శక్తి సామర్థ్యములనుబట్టి ప్రవేశము నొసంగవలెను గాని కులము లేక జాతినిబట్టికాదు, అనుటచేత ప్రజ్ఞావంతులకు మాత్రమే అవకాశ మొసంగబడెను.

కళాశాలానంతరము శాస్త్రపరిశోధనకొరకు ఒక పరిశోధనా కళాశాల స్థాపించి విశ్వమానవ కళ్యాణమునకై వలయు కళల పరి శోధనలు సల్పవలెను.

విశ్వవస్తు జ్ఞానశిక్షణ

ఇదివరకు మనము కమీనియస్ పాఠశాలలను నాలుగు విధములుగ విభజించెనని చెప్పితిమి. ఇప్పుడు ఆ పాఠశాలలలో బోధింపవలసిన ప్రణాళికను పరిశీలించుదము.

1. శిశుపాఠశాల

శిశువులకు భూగోళము, చరిత్ర, వ్యాకరణము, గణితము, రేఖాగణితము, జ్యోతిషము, అర్థశాస్త్రము. (Economics). నీతి, మతము మొదలగు విషయములు బోధింపవలెను. విషయ విస్తరమును చూచి భీతినొంద నవసరములేదు. బాలుర మానసిక దశల ననుసరించి పై విషయముల గురించి స్వల్పముగా జ్ఞానము కలుగజేయవలెను. వారికి స్వల్పముగా కార్యకారణ సంబంధము, దేశకాల, గణితజ్ఞానము ఇవ్వవలెను. తమ అభిప్రాయములను నిర్భయముగా తెలుపునట్లు ప్రోత్సహించవలెను. మంచి అభ్యాసములను కలుగజేయుటయే ఈ దశయొక్క ముఖ్యోద్దేశ్యమని తెలిసికొనవలెను. పైన ఉదాహరించిన ఈ అభిప్రాయములు ఫ్రోబెల్ యొక్క కిండర్‌గార్టన్ పద్ధతిని సూచించుచున్నవి. కమీనియస్ ఆటలకును నిర్మాణకార్యక్రమమునకు ప్రాధాన్యమిచ్చి ఫ్రోబెల్‌కు మార్గదర్శి అయ్యెను.

2. ప్రాథమిక లేక దేశీయ పాఠశాల

ఈ పాఠశాలలోకూడ శిశుపాఠశాలలోవలె మాతృభాషలోనే విద్య నేర్పవలెను. లాటిన్ పాఠశాలలో చేరగోరువారికి లాటిన్ భాష నేర్పవచ్చును. బాలురు ప్రాథమిక పాఠశాలానంతరము విద్య నభ్యసింపజాలనిచో వారికి పైన ఉదాహరించిన రీతి ప్రణాళికలోని విషయములే గాక వాఙ్మయము, నైతికవిద్య, మతజ్ఞానము కలుగజేయవలెను. భూగోళము, చరిత్ర వారి దేశము

నను సంబంధించినంతవరకే బోధింపవలెను. యంత్రములను గురించి స్వల్పజ్ఞానము కలుగజేయవలెను.

**3. ఉన్నత పాఠశాల** ఈ పాఠశాలలోని బాలురకుగూడ విశ్వ వస్తుజ్ఞానము కలుగజేయుచు మాతృభాషతో పాటు లాటిన్, గ్రీకు, హీబ్రూభాషలు కూడ నేర్పవలెను.

**4. కళాశాల** కళాశాలలో అభ్యసించు విద్యార్థులకు ప్రణాళిక మిక్కిలి విపులముగ నుండవలెను. అన్ని కళలు శాస్త్రములు నేర్చుకొనుటకు అవకాశము కలుగజేయవలెను. విద్యార్థులు తమ యభిరుచుల ననుసరించి శాస్త్రవరణము చేసికొనవలెను. ప్రజ్ఞావిశేషము గల విద్యార్థులు కొందరైనను అన్ని కళలను, శాస్త్రములను అభ్యసించునట్లు ప్రోత్సహించవలెను.

**ప్రకృతి పద్ధతి** కమీనియస్‌కు పూర్వము ఉన్న పాఠశాలల స్థితి అతనికి రుచింపలేదు. అవి అభిరుచిరహితముగను, కాలయాపనము జేయునవిగను, దయావిహీనముగను ఉండెడివి. ఇట్టి లోపములను సవరించుటకు ప్రకృతి మార్గానుసరణము మంచిదని కమీనియస్ తలంచెను. ప్రకృతి తన పనులెల్ల సులభముగను సంపూర్ణముగను సకాలములోను నిర్వర్తించుకొనుచున్నది. ప్రకృతి నననుసరించి పాఠశాలలలో విద్యాభ్యాసమునకు తగినకాలము నిర్ణయింపవలెను. వసంతకాలములో అనగా బాలురు చిరుతప్రాయమున నున్నప్పుడే విద్య ప్రారంభింపవలెను. ప్రాతఃకాలమే విద్యాభ్యాసమునకు తగిన సమయము. ప్రకృతిలోవలె విద్యావిధానముకూడ క్రమముగ అభివృద్ధి కలుగునట్లుగ నుండవలెను. జ్ఞానార్జనకు ఇంద్రియములు, బుద్ధి, అంతర్దృష్టి ముఖ్యమైన మార్గములు. బోధనా

విధానము ప్రతిష్ఠాపన పద్ధతిపై ఆధారముచేసి క్రొత్తపద్ధతుల నవలంబింపవలెను. బాలురు గ్రహించునట్లు చేయుటకు యథార్థ వస్తు ప్రదర్శన లాభదాయకము. అవి దొరకనిచో ప్రతిరూపములను జూపవలెను. కేవలము పుస్తకజ్ఞానము నిరుపయోగము. భాషలు, కళలు, మతసంబంధమైన విషయములు వ్రాతరూపముగ బోధింపవలెను. చదువుట, వ్రాయుట, సంగీతము అభ్యాసము వలన నలవడునట్లు చేయవలెను. నీతిమార్గము ఆచరణవలనను ఆదర్శమువలనను అలవడవలెను. ప్రణాళికలో చేర్పబడిన విషయములకుగల పరస్పర సంబంధమును దెలుపవలెను. తిరిగి తప్పు చేయకుండునట్లు జేయుటయే దండనముయొక్క ఉద్దేశ్యము. అట్టి దండనము శాలురు మంచికేయని వారు గ్రహించునట్లు చేయవలెను. పాఠములు చదువనియెడల దండింపరాదు. అవినీతికరమగు పనులు చేసినప్పుడు మాత్రమే వారిని దండింపవలెను.

కమీనియస్ యొక్క అభిప్రాయముల వలన కలిగిన మార్పులు

అతడు గొప్ప విద్యాసంస్కారియే గాక ప్రస్తుత విద్యావిధానమునకు మూలపురుషుడు. విద్య ప్రకృతి పద్ధతుల ననుసరించి ఉండవలెననియు, సుఖముగా జీవనము గడుపుటకు ఆవశ్యకమైన విద్య, క్రమశిక్షణ ఇవ్వవలెననియు, జాతి, లింగ భేదములు ధనికనిర్ధనిక భేదములులేకుండ అందరి మానసిక దశలకు తగినట్లుగా పాఠశాలల నిర్మాణము అవసరమనియు వక్కాణించెను. పసిపిల్లలకు శిక్షణావశ్యకత జూపినవారిలో కమీనియస్ ప్రథముడు. శారీరిక దార్ఢ్యమునకు సంబంధించిన విద్య నేర్పవలెననెను. జ్ఞానార్జనకు పంచేంద్రియములు ముఖ్యమార్గములని తెలిపెను. లాటిన్ భాషను త్రోసివేసి మాతృభాషకు ప్రాముఖ్యమునిచ్చెను. విద్యాప్రణాళికలో పెక్కు విషయములజేర్చి అన్ని శాస్త్రములు అన్ని కళలు క్రమాభివృద్ధిగ బాలురకు నేర్పవలెనని భావించెను. విషయముల పరస్పర సంబంధమును, వాటి ఐక్యమును నిరూపించెను.

లాటిన్ భాష బోధించునప్పుడు కూడ యథార్థవస్తువులను పరిశీలించి జ్ఞానము కలుగజేయవలెనని చెప్పెను. ఈ ఉద్దేశ్యము నెరవేర్చుటకై పెక్కు వాచకములను సిద్ధపరచెను. విద్యను లాభదాయకముగను, ఆనందదాయకముగను సహజముగను జేయుటకు వివిధరీతుల యత్నించెను. కాని రెండు శతాబ్దులవరకు అతని విద్యావిధానమువలన ఎట్టి మార్పులును పాఠశాలలలో కలుగలేదు. కాని అతని బోధనాపద్ధతులు పాఠ్యగ్రంథములు మాత్రము మన్ననబడసెను.

అతని అభిప్రాయములు ప్రస్తుత విద్యా విధానమునకు పునాది యయ్యెనని చెప్పవచ్చును. అతని అభిప్రాయముల ననుసరించియే "ఫ్రాంకి" అను విద్యావేత్త సుఖమైన జీవనమునకు దారిచూపు ప్రణాళికను సిద్ధపరచెను. "పాఠశాలలలో బోధనా పద్ధతి బాలుర మానసిక పరిస్థితులకు తగినట్లుండవలెను గాని బోధనాపద్ధతుల కనుగుణముగా బాలురను మార్చగూడదు" అనెడి రూసో తెలిపిన అభిప్రాయము ఇతనిదే. "Basedow" బేస్‌డో తన విశ్వవస్తుజ్ఞాన శిక్షణ, ప్రకృతి ననుసరించు పద్ధతి కమీనియస్‌నుజూచియే నేర్చెను. మానవులందరికిని విద్యావశ్యకత, పసిపిల్లలయందు ప్రేమ, వస్తువులను ప్రదర్శించి విద్య నేర్పుట—ఈ మూడు విషయములను కమీనియస్‌నుజూచియే పెస్టాలొజీ నేర్చుకొనెను. శీలముయొక్క ఆవశ్యకము, శాస్త్రపద్ధతుల ననుసరించి బోధించుట, ప్రణాళికకు ప్రాముఖ్యము నిచ్చుట—ఈ మూడును హెర్బార్టు, కమీనియస్ నుండియే తెలిసికొనియుండును. ఫ్రోబెల్ యొక్క కిండర్ గార్టన్ పద్ధతి స్వయంకృషియొక్క ప్రాముఖ్యమునకు కమీనియస్సే త్రోవజూపెను. కమీనియస్ విద్యను శాస్త్రీయముగా పరిశీలించి విద్యా సమస్యలనుగురించి పాఠశాలలలో స్వయముగా పరిశోధనలు, ప్రయోగములు జరిపి అనుభవమును

గడించెను. అతని బుద్ధి వికాసము తెలివి తేటలు అనన్యములు. నవీన విద్యాపరిస్థితులకు కారణభూతులగువారిలో కమీనియస్‌కు అగ్రస్థాన మీయదగును.



# జాన్ లాక్

## 1632 మొ॥ 1704 వరకు

బాల్యము, విద్యాభ్యాసము.

ఇతడు ఇంగ్లాండు దేశములోని సోమర్సెట్ పట్టణమున ఒక గొప్ప కుటుంబమునందు జన్మించెను. ప్యూరిటన్ మతబోధకు డొకడు ఇతనికి బాల్యమందు విద్య నేర్పెను. అటుపిమ్మట నతడు వెస్టుమినిస్టర్ పాఠశాలలో ప్రవేశించి, మహావిద్వాంసుడైన బుష్బితో సాంగత్యముచేసెను. దానివలన నతనికి స్వాతంత్రేచ్ఛ యలవడెను. తర్వాత లాక్ ఆక్సుఫోర్డు కళాశాలలో ప్రవేశించెను. అచటి విద్వాంసుడగు డీకార్టెయొక్క భావములు లాక్‌యొక్క హృదయములో సంచలనము కలుగజేసెను. ఆక్సుఫోర్డు కళాశాలలో ను త్తీర్ణుడైన తర్వాత అచటనే తత్వశాస్త్రమును బోధించుటకై అధ్యాపకుడుగా నియమింపబడెను. గ్రీకు భాషలో పాండిత్యము గలవాడు కావున కొంతకాలమతడు గ్రీకు భాషనుగూడ బోధించెను. ఆ కాలములో విద్యావిషయమై చాల వాదోపవాదములు జరుగుచుండెను. లాక్ తన అభిప్రాయములను వ్యాసరూపమున ప్రచురించుచుండెను. అతని స్వాతంత్రేచ్ఛకును, ఆక్సుఫోర్డు కళాశాలలోని సాంప్రదాయసిద్ధమగు సంకుచిత భావములకును పొందు కుదురకుండెను.

ఉపాధ్యాయవృత్తిలో అనుభవము గడించుటచేత షాఫ్ట్సుబరీ ప్రభువుయొక్క పిల్లలకు విద్య నేర్పుటకై నియమింపబడెను.

దాని వలన లాక్ చాల అనుభవము సంపాదించెను. ఈ జ్ఞానమే ఇతని విద్యాసూత్రములకు పునాదియయ్యెను. ఆ అనుభవము వలననే తరగతిలో బాలురకు అందరితోబాటు విద్య నేర్పుటకంటె ప్రత్యేకముగా నొక యుపాధ్యాయునివద్ద విద్యనేర్పించుట ఎక్కువ లాభకరమని అతడు గ్రహించెను.

అతని రచనలు: లాక్ మంచి రచయిత. మానవజీవితము లోని వివిధ విషయముల నెరిగినవాడు గావున అతని దృష్టి విశాలమయ్యెను. విద్యావిషయములను గురించియేగాక రాజనీతి, తత్వశాస్త్రము, మతమును గురించికూడ పెక్కు పుస్తకములను రచించెను. వాటి యన్నిటిలో పరిభుత్వము (Government) అను గ్రంథము ప్రశస్తమైనది. దానిలో ప్రజాసామ్య పరిభుత్వమును బలపరచుచు ప్రజాస్వాతంత్ర్యను వ్యక్తపరచెను. మతమును గురించి (Letters on Toleration) పరమత సహనము అను శీర్షికతో ఉత్తరములు ప్రచురించెను. వానిలో వ్యక్తిస్వాతంత్ర్యమును వెలిబుచ్చుచు మతగురువుల అభిప్రాయములను ధిక్కరించెను. అటుపిమ్మట మానవుల గ్రహణశక్తిని గురించి ఒక వ్యాసమును ప్రచురించెను. (Essay Concerning the Human Understanding) దానిలో సాంప్రదాయసిద్ధమగు పూర్వీకుల అభిప్రాయములను అర్థరహితమగు సమాసములను ఖండించెను. సాంప్రదాయములు యజమానుల చేతను, గురువులచేతను విధింపబడి మానవుల బుద్ధిని, వివేకమును నిర్మూలముచేసి విషయములను పరీక్షింపకయే నమ్మునట్లు ఒనర్చెనని ఉద్ఘాటించెను. జ్ఞానమంతయు అనుభవము వలననే కలుగుననియు, ఇంద్రియానుభవము వలనను, ఆలోచనల వలనను, మనస్సులో అభిప్రాయము లేర్పడుననియు, అభిప్రాయములకు ఆచరణకును సంబంధ మేర్పడినపుడే నిజమైనజ్ఞాన మేర్పడుననియు తెలిపెను. ప్రతి విషయముయొక్క నిజానిజము, జ్ఞానము పరి

శీలనయనెడి ఒరిపిడిరాయిపైగీచి పరీక్షింపవలెననియు,యుక్తాయుక్త జ్ఞానము కలుగజేయుటకు మనస్సునకు అభ్యాసశిక్షణ (Formal Discipline) అవసరమనియు, అట్టి అభ్యాసశిక్షణ విద్యవలన మాత్రమే సంభవమనియు లాక్ అభిప్రాయపడెను.

విద్యావిషయమును గురించి కొన్ని అభిప్రాయములు అను పేరట మరియొక పుస్తకమును రచించెను. దానిలో తన అభిప్రాయములను ఈక్రింది విధమున ప్రకటించెను. బుద్ధివికాసము కంటె శీలమే అధికము. శీలము, విజ్ఞానము, సదాచారము, పఠనము విద్యయొక్క ముఖ్యప్రయోజనములు. బాలునికి ప్రత్యేకోపాధ్యాయుడు విద్యనేర్పుట ఉచితము. ఉపాధ్యాయుని శీలము నిర్దుష్టముగా నుండవలెను. దేశాటన వలన విశాలదృష్టియు, పరిసరములకు తగినట్లు మెలగుటయు నలవడును. సంకుచిత కావ్య పఠనము, అరుచికరమగు వ్యాకరణబోధ నిరుపయోగము. పెద్ద మనుష్యులకు లాటిన్ భాషాజ్ఞానము అవశ్యము. లాటిన్ భాషను మాట్లాడుచు చదువుచు నేర్వవలెను. వ్యాకరణ సూత్రముల ద్వారమున నేర్పుట ఉపయోగకరముకాదు. మానసిక వికాసమునకు పుస్తకపఠనము తోడ్పడినట్లు, నృత్యము, గుఱ్ఱపుస్వారి, కుస్తీ మొదలగునవికూడ చేయూతనిచ్చును. ప్రతి విద్యార్థి కొన్ని వృత్తులను అభ్యసింపవలెను. అవి జీవితమును సుఖప్రదముగా గడుపుటకు సహకరించునను ఉద్దేశ్యముతోగాక ఆరోగ్యము, విరామము కలుగజేయునను తలంపుతో నేర్వవలెను. మాతృభాషలో విద్య ప్రారంభించవలెను. విదేశభాష నేర్చుటకు శక్తిసామర్థ్యములు గలిగిన తర్వాత బాలుర దేశమునకు దగ్గరగా నుండు దేశభాష నేర్పవలెను. లాటిన్ భాష నిర్బంధముగా నేర్పరాదు. విషయజ్ఞానము కలుగజేయు అంశములకు, భాషకు పరస్పర సంబంధ ముండవలెను. అక్షరజ్ఞానము ఆటల మూలమున నేర్పవలెను. ఆటవస్తువులగు పాచికలకు ఇరువైపుల అక్షరము

లుండవలెను. బాలురు చదువుట ప్రారంభించినపుడు వారికి సులభమైనట్టియు, ఆకర్షణీయమైనట్టియు పుస్తకము లీయవలెను. పరిశీలన వలనను, యింద్రియముల వలనను, మనస్సులో అభిప్రాయ మేర్పడును. యోచనవలన అభిప్రాయములలో ఐక్యము లేక కలయిక ఏర్పడును. శాస్త్రమును ప్రతిష్ఠాపన పద్ధతుల ననుసరించి బోధింపవలెను. బాలుర పూర్వజ్ఞానమునకు సంబంధించిన విషయములు మాత్రమే నేర్పవలయును. బాలురను దండించుట నిరుపయోగము. దానివలన ఉపకారము కలుగుటకుమారు అపకారము కలుగవచ్చును. శ్లాఘించుట, అవమానపరచుట, క్రమశిక్షణకు ఉత్తమమైన మార్గములు. బుద్ధిలోపమునకు బాలుర దండింపరాదు. అవినీతికి మాత్రమే దండింపవలెను.

**లాక్ యొక్క అభ్యాస శిక్షణా వాదము :** లాక్ గ్రంథపఠనవాది యనిగాని యింద్రియ వాస్తవజ్ఞాని యనిగాని నిర్ణయించుట సులభము కాదు. అతడు ఈ రెంటి కంటెను 'హేతువాది' యని చెప్పుటకు ఎక్కువ అవకాశముండును. రాజకీయ విషయములందు పౌరస్వాతంత్ర్యవిషయమున అతడు స్వాతంత్ర్యవాది. పూర్వసాంప్రదాయములను, సిద్ధాంతములను నమ్మువాడు కాదు. అతడు రచించిన 'మానవ గ్రహణశక్తి (Conduct of Human Understanding) అను పుస్తకములో అర్థరహితమైన పదములు, సాంప్రదాయములు, వ్యర్థములని స్పష్టపరచెను. సాంప్రదాయములు, ఆచారములు, మానవుని హేతువాదమునకు, వివేచనా శక్తికిని అమితమైన నష్టమును కలుగజేయుచున్నవని అతని భావన.

జ్ఞానమంతయు అనుభవముచేతనే కలుగుచున్నది. మనస్సు ఒక పరిశుభ్రమైన కాగితము లేక మైనము వంటిది. అట్టి మనస్సును ఇష్టమువచ్చిన రీతిని మార్చవచ్చును. ఇంద్రియానుభవము వల్లను, ఆలోచనవలనను అభిప్రాయములు అట్టి మనస్సులో

చిత్రింపబడును. ఆ అభిప్రాయములయొక్క నిజానిజములను మానవుడు తెలిసికొనవలెను. అభిప్రాయములకును, నిత్య అనుభవములకును గల సంబంధమే జ్ఞానమనబడును. పై రెంటికినిగల సంబంధము తెలిసికొనుటకు మానవుడు ఆత్మపరీక్ష చేసికొనుచుండవలయును. ఇట్టి సంబంధమును గుర్తించుటకై అభ్యాసశిక్షణ అవసరము. ఈ శిక్షణ విద్యవలననే చేకూరును.

అభ్యాసములు క్రమముగా ఒక పనిని పలుమారులు చేయుటచేత అలవడును. శారీరిక లేక మానసిక విషయములు అభ్యాసముఖవలననే అలవడును. స్వతస్సిద్ధములు లేక నైజములని యనబడు లక్షణములుగూడ అభ్యాసఫలితములే. ఇట్టి అభ్యాసములు పలుమార్లు ఒకే పనిని చేయుటవలన కలుగును. బాల్యమునుండి హేతువాదన అభ్యసింపనివారు పెద్దవారైనతర్వాత దానిని నేర్వజాలరు. త్రాడుపై నృత్యముచేయుట, మంచి వ్రాత వ్రాయుట వలెనే హేతువాదనగూడ అభ్యాసఫలితమే. గణితము, హేతువాదము నభ్యసించుటకు మిగుల తోడ్పడును. కావున బాలురందరికి గణితమును బోధించి హేతువాదన నేర్పుటకు తగిన శిక్షణ యివ్వవలెను. గణితమువలెనే కావ్యపఠనము ప్రణాళికలో చేర్చుటవలన బాలుర హేతువాదనాశక్తి అతిశయిల్లును. గణితము కావ్యపఠనము వలన గలుగు విషయజ్ఞానముకంటె వానిని నేర్చుట వలన అబ్బు మానసిక వికాసము చాల ఎక్కువ. కావున జ్ఞానార్జనకొరకై కాక మనోవికాసమునకై విషయములు ప్రణాళికలో చేర్చవలెను. ఇట్లు హేతువాదనాశక్తి వృద్ధియైనచో ఇతర విద్యలు లేక విషయములు సులభముగా అభ్యసింపవచ్చును.

లాక్ యొక్క అభ్యాస శిక్షణవాదము కేవలము మానసికాభివృద్ధికేకాక నైతిక, శారీరిక అభివృద్ధికికూడ వర్తింపజేయబడెను. మానవుడు తన కోరికలను అరికట్టుట యభ్యసించినచో నైతికబలము పెంపొందును, కష్టములను సహించగలుగును,

దానివలన శరీర దార్ఢ్యము పెరుగును. పిల్లలను గారాబముగా పెంచుటవలన వారు బలహీనులగుదురు. శీతోష్ణపరిస్థితులను ఎదుర్కొనుటకు అలవాటు చేయవలెను. వారికిచ్చు ఆహారము సాధారణమైనదిగా నుండవలెను. వారి పాన్పు మెత్తగ నుండరాదు. ఈ విధముగ కోర్కెలను జయించుటకు అవకాశము కలుగజేసి నైతికశక్తి శారీరికశక్తి అభివృద్ధిపరచవలెను. కోరికల నరికట్టుటవలన నైతిక శిక్షణ, కష్టముల సహించుటవలన శారీరిక శిక్షణ కలుగును.

విద్యాచరిత్రిలో కమీనియస్ వాస్తవ ఇంద్రియజ్ఞానాభిమానియనియు, డీకార్టె గణితశాస్త్రవేత్త యనియు, మాన్టైన్ వాస్తవ కావ్యపఠనాభిమాని యనియు కీర్తి సంపాదించినట్లే అభ్యాసశిక్షణాభిమానియని లాక్ పేరు గడించెను.

ప్రణాళికలో చేర్చిన విషయములను చదువుటవలన బాలుర మానసిక శక్తిసామర్థ్యములు పెరుగుననియు, ఆ శక్తి సామర్థ్యములు ఇతర విషయములు తెలిసికొనుటకు ఉపయోగించుననియు లాక్ మరియు అతని శిష్యుల వాదము.

# రూసో

## క్రీ. శ. 1712—1778

బాల్యము, విద్యాభ్యాసము:

రూసో స్విట్జరులాండులోని జెనీవాలో జన్మించెను. అతని తండ్రి గడియారములను బాగుచేయువాడు. చంచలస్వభావుడు, భోగాసక్తుడు. అతని తల్లి ఒక పురోహితునికుమార్తె. రోగిష్ఠిది. సున్నితస్వభావముగలది. రూసో పుట్టినతోడనే తల్లి చనిపోవుటచేత పినతల్లి యాతనిని సాకెను. మొదటినుండియు దొంగతనము, అబద్ధములాడుట కలవడిన రూసోస్వభావమును పినతల్లి సరియైన నైతికమార్గమునకు త్రిప్పలేకపోయెను. తండ్రికూడ కుమారుని యందు శ్రద్ధచూపకపోవుటచేత అతనికి ఇంద్రియ నిగ్రహము కలుగలేదు.

ఆరేండ్లప్రాయమప్పుడే తండ్రి యితనికి హాస్యాస్పదములును నీతిబాహ్యములునగు పుస్తకములు చదివి వినిపించుటచేత రూసో యందు ఊహ, ఉద్రేకము, వయస్సునకు మించినబుద్ధి ప్రబలెను. అటుపిమ్మట తన తాతగారి గ్రంథాలయములోనున్న చారిత్రిక గ్రంథములను జదివెను. దానివలన రూసోయొక్క శీలములో గొప్ప మార్పుగలిగెను. ప్రజాప్రభుత్వభావము, స్వాతంత్ర్యేచ్ఛ, వీరపురుషుల జీవితములందు గౌరవము, గర్వము మొదలగు గుణములు గ్రంథావలోకనమువలన నితనిలో జనించెను. ఆత్మనిగ్రహము లేకపోవుటచేత నితడు క్రమముగా విప్లవాభిమానిగామారి, అప్పటి కాలములో నుండిన సంఘమును నిర్మూలించు నిచ్ఛగలవా

డాయెను. తరువాత రెండు సంవత్సరములవరకు తన పినతండ్రి కొడుకుతో జెనీవాపట్టణమునకు సమీపముననున్న 'బాసీ' అను గ్రామములో విద్య నభ్యసింపవెళ్ళెను. ఇక్కడనుండగా నతనికి ప్రకృతియందుగల సహజప్రేమ యతిశయిల్లెను. గ్రామజీవితము నందుగల సౌఖ్యమును తెలిసికొనెను. నిర్బంధముల వలనను, కఠినశిక్షణలవలనను సంఘము ప్రకృతికి దూరమై చెడిపోయెనను అభిప్రాయ మతనికి గలిగెను. ఈ విధముగా రెండేండ్లు 'బాసీ'లో గడిపి తన స్వస్థానమునకుజేరి సోమరిగా కాలమంతయు గడుపసాగెను. ఒక వర్తకునివద్ద నాలుగు సంవత్సరములు కొలువుండెను. ఆతని స్వభావము మరింత పాడయ్యెను. దొంగతనము చేయుట, అబద్ధములాడుట, ద్రిమ్మరివలె దిరుగుట మరింత ఎక్కువయ్యెను. తుదకు జినీవాపట్టణమును వదలి పెక్కు వత్సరములు ద్రిమ్మరియై తిరుగుచు నీచములు, నీతిబాహ్యములునగు పనులలో మునిగియుండెను. ఈ సమయమున నతనికి సేవాయెలోని ప్రకృతి దృశ్యములను చూచుట కవకాశము గలిగెను. ప్రకృతి యందు ప్రేమ యినుమడించెను. విద్యాభివృద్ధిగూడ గలిగెను. 19 ఏండ్ల వయస్సురాగానే సేవాయెలోనున్న నీచప్రవృత్తిగల 'మేడమ్ డీలారెన్సు' అను కులటతో కాపురముచేయ మొదలిడెను. సుమారు పది సంవత్సరములు ఆమె ద్రవ్యముతోనే కాలము గడిపెను. ఆమెతోనుండగా నప్పుడప్పుడు లాటిన్ భాష, సంగీతము, వేదాంతము, భౌతికశాస్త్రజ్ఞానము కొంత సంపాదించెను. బీద వారి కష్టములనుజూచి వారియం దభిమానము గలవాడయ్యెను. ప్రకృతియం దనురాగము మరింత యతిశయిల్లెను. పదియేండ్ల పిమ్మట లారెన్సుకును తనకును వైరముగలుగుటచేత 'సేవాయె'ను విడిచి 'ప్యారిస్' నగరము చేరెను. అక్కడ తన జీవికకై స్వయముగా ధనార్జన చేయవలసివచ్చెను. అందుచేత రూసో క్రమముగా తన బాధ్యతను గుర్తింపమొదలిడెను. క్రమముగా నతని

స్వభావములో గొంత మార్పు గలిగెను. కాని యుద్రేకము, ప్రకృతియం దనురాగము, అతిసున్నితమైన స్వభావము అతనిలో గోచరించుచునే యుండెను.

ఆకాలమున 14 వ లూయీ 'ఫ్రాన్సు' దేశమును పరిపాలించు చుండెను. రాజ్యపరిపాలన మంతయు ఆతని కిష్టులగు కొలది మంది చేతులలోనుండెను. ప్రజలు పన్నులభారముచే నణగ ద్రొక్కబడి వాక్స్వాతంత్ర్యములేక, అధికారులకు దాసులై అష్ట కష్టముల ననుభవించుచుండిరి. ఇట్టి విపరీత దేశపరిస్థితుల ఖండించుచు ప్రజలు విరక్తిని ప్రకటింపసాగిరి. నిరాడంబర జీవితమందు ప్రజల యభిమానము హెచ్చసాగెను. మానవుడు కృత్రిమ జీవనమున కలవాటుపడుటచే నిట్టి దుస్థితి వచ్చెనని, సంఘసంస్కరణ కవసరమగు చట్టములు, సంస్థలు కావలెనని ప్రజలలో నలజడి ప్రారంభమయ్యెను. ఈ పరిస్థితులు రూసో స్వభావమున కను కూలించెను. రోషపూరితుడును, ఆత్మనిగ్రహము లేనివాడును, క్రమశిక్షణ పొందనివాడును గాన నాతడు విప్లవమునకు దారి తీసెను.

రూసోయొక్క రచనలు :

జీవనోపాధికై రూసో గ్రంథరచన మారంభించెను. వ్యాసరచన పోటీలలో రెండు వ్యాసములు రచించి బహుమానముపొంది కీర్తిగడించెను. అందులో మొదటివ్యాసము "భౌతిక శాస్త్ర కళాభివృద్ధిచే మానవ నైతిక జీవితము బాగుపడెనా, చెడెనా ?" అనునది. (Has the Progress of the Sciences and Arts Contributed to Corrupt or to Purify Morals) ఈ వ్యాసములో పై రెంటి యభివృద్ధివలన మానవజీవితమునకు కళంకము వచ్చెనని దెలిపెను. "మానవులలో విభేదములకు మూలము" అను రెండవవ్యాసములో (The Origin of Inequality among Men) ఆస్తి, సంపాదనలు యీ భేదములకు కారణములని వివరించెను.

మూడవ రచనయగు 'దిన్యూ హెలాయిస్' (The new Heloise) లో పూర్వ నాగరికతను, నిరాడంబర జీవితమును పునరుద్ధరించ వలెనని వ్రాసెను. ఆదర్శప్రాయమగు రాజకీయ పరిస్థితులను తన నాల్గవ రచనయగు "ది సోషియల్ కాన్ట్రాక్ట్" (సాంఘిక ఒడంబడిక) The Social Contract లో వర్ణించెను.

అతడు రచించిన "ఎమిలీ" యను గ్రంథము ఆతనికి శాశ్వతమైన కీర్తిని సంపాదించెను. ఈ పుస్తకములో నాతడు నాగరికతలోని లోపములను సవరించి, ప్రకృతి కనుగుణమగు పరిస్థితులను విద్యయెట్లు సమకూర్చునో తెలిపెను. సాంప్రదాయములపై, ఆచారములపై ఆధారపడియున్న విద్యను సంస్కరించి సహజపరిస్థితులలో విద్య నేర్పిన బాగుండునని యభిప్రాయపడెను. ఆ కాలములో విద్య కేవలము బాహ్యప్రవర్తనకును, నృత్యములకును ప్రాధాన్య మిచ్చుచుండెను. లాటిన్ భాషా జ్ఞానమునకు, వ్యాకరణమునకు, కంఠపాఠమునకు అగ్రస్థాన మివ్వబడుచుండెను. రూసో ఈపద్ధతులను ఖండించి సంస్కరింప కంకణముగట్టెను. 'ఎమిలీ' యను కల్పితవిద్యార్థికి విద్యనేర్పుటయను పేరుతో ప్రకృతి పద్ధతుల ననుసరించి శైశవమునుండి యౌవనదశవరకు విద్యనేర్పు విధానమును వివరించెను. ఈ గ్రంథమును ఐదుభాగములుగ విభజించెను. మొదటి నాలుగుభాగములలో ఎమిలీకి శైశవ, బాల్య, కౌమార, యౌవనదశలలో విద్యగఱపుపద్ధతిని, ఐదవభాగములో ఎమిలీకి కాబోవుభార్యయొక్క విద్యాభ్యాసమును గురించి స్పష్టపరచెను.

భగవంతునిచే నిర్మింపబడిన ప్రకృతికనుగుణముగా నుండు పద్ధతులె మంచివనియు, మానవుని చేతిలో ప్రకృతియంతయును నసహజముగా మారుననియు రూసో అభిప్రాయము. మనము ప్రకృతి, ఉపాధ్యాయుడు, వస్తువులు అను ఈ మూటియొక్క పరస్పరాధారమువలన విద్యను సంపాదింతుము. ప్రకృతి మన

స్వాధీనములో లేను. గాన తక్కిన రెండు అనగా ఉపాధ్యాయుడు, వస్తువులు ప్రకృతి ననుసరించి యుండినచో విద్య యభివృద్ధి జెందును. విద్యయొక్క ముఖ్యోద్దేశ్యము పౌరత్వమునకు గాని, వృత్తికిగాని మానవులను సిద్ధముచేయుటగాదు. మానవత్వమును వృద్ధిపరచి ప్రపంచములో తమ తమ విధులను నిర్వర్తించుటకు తగిన శక్తిసామర్థ్యములు గలుగజేయుటయే విద్యయొక్క పరమోద్దేశము. బ్రతుకు నేర్పు నలవరచుటే విద్యయొక్క యుద్దేశము. తలిదండ్రులుగాని, నిపుణుడైన యుపాధ్యాయుడుగాని బాలురకు తగిన శిక్షణ నివ్వగలరు.

ప్రకృతిదృశ్యములతో నిండియుండు గ్రామములకు శిశువులను బంపవలయును. అట్లు చేయుటవలన అపాయకరములగు పట్టణ నాగరికతా లక్షణములు వారి కలవడకుండును. వైద్యుల సలహాగాని, సహాయముగాని వారి కవసరముండదు. శిశువుయొక్క సహజమైన కోరికలను ఆటంకపరచగూడదు. అన్నివిధములైన శీతోష్ణ పరిస్థితులకు వారి నలవాటు చేయవలయును. నియమితమైన కొన్ని యాటపాటలు మాత్రమే శిశువులకు నేర్పకూడదు. వారికి ఆటవస్తువులను సహజమైన ప్రకృతినుండియే ఎన్ని ఈయవలయును. పువ్వులు, కాయలు, ఆకులతో నిండిన రెమ్మలే వారి యాటవస్తువులుగా నిర్ణయించవలెను.

రూసోయొక్క విద్యాప్రణాళిక :

1. 5 సంవత్సరములు లేక అంతకులోపుగల బాలురకు:- వీరి శరీరదార్ఢ్యతను గాపాడుటయే ఈ వయస్సులో విద్యయొక్క ముఖ్యోద్దేశము. శిశువుల స్వభావములు, ప్రేరణలు చెడకుండ చూచుచు, బుద్ధిని సన్మార్గమందు బెట్టుటయే ఈ దశలోని విద్యయొక్క ముఖ్యోద్దేశము. బాలురు మాట్లాడుభాష సులభము గను, సహజముగను ఉండవలెను. వారి నిజమైన అభిప్రాయముల దెలుపుటకు దగిన మాటలే నేర్పవలెను.

2. 5 నుండి 12 సంవత్సరములు :- పైన నుదాహరించిన విధమున అనుకూలము, ప్రతికూలమునగు విద్యావిధానము రెండవదశలోగూడ అనుసరించవలెను. జ్ఞానము వచ్చువరకు నైతిక విద్యాభ్యాసము చేయుటవలన ప్రయోజన ముండదు. ఈ దశలో స్వతస్సిద్ధముగ బాలురలోగల మంచి స్వభావములను, ప్రేరణలను చెడకుండ కాపాడి బుద్ధిని తప్పుత్రోవలో పోకుండ జూడవలెను. హేతువాదశక్తి యభివృద్ధి జెందియుండదు గావున నైతికవిద్య నేర్పరాదు. ఆజ్ఞ, విధేయత, విధులు మొదలగునవి బాలురు గ్రహించలేరుగావున వారికి వర్తింపజేయరాదు. కాని పరిస్థితుల ననుసరించి కొన్ని పాఠములు చెప్పవలసియుండును. అనుభవముచేతనే విషయముల నేర్చుకొనునట్లు చేయవలెను. విధి నిషేధములను తెలిసికొను పర్యంతము అనుభవజ్ఞానమే వారికి గురువు. సామానుగాని, కిటికీలుగాని విరుగగొట్టినచో, దాని వలన గలుగు నిబ్బంది, ఫలితముల ననుభవింపనీయవలెను. అబద్ధమాడవద్దని చెప్పుటగాని, శిక్షించుటకాని కూడదు. బాలురకు వయస్సు రాకపూర్వమే విద్యావిషయముల నేర్పుట మంచిది కాదు. ఈ వయస్సులో 'ఎమిలీ' భూగోళము, చరిత్ర, భాష మొదలగునవి నేర్వలేదు. బాలురకు పుస్తకము లనర్థదాయకములు. ఈ దశలో పిల్లల శరీరాభివృద్ధికి పాటుపడవలయును. శరీరము, ఇంద్రియములు, తదితరాంగములు బలపడిన తర్వాత జ్ఞానార్జన సాధ్యమగును. కష్టములకోర్చు శిక్షణయే బాలురకీయవలెను. వారికి నిద్ర చాల ఆవశ్యకము. ఈదుట, ఆటలాడుట, దుముకుట మొదలైనవికూడ నేర్పవలయును. నిత్యావసరములును, సహజములును అయిన కొన్ని విషయములు. అనగా తూచుట, కొలుచుట మొదలైనవి వారే తమంతట తాము నేర్చుకొనవలెను. చిత్రలేఖన మభ్యసించువారు హస్తకౌశలమును, దృష్టినైపుణ్యమును గడింపవలెను.

3. 12 నుండి 15 సంవత్సరములు ఈదశ:- వచ్చునప్పటికి పిల్లల శరీరము బలపడి, ఇంద్రియములు తగిన శిక్షణ పొందియుండును. కోరికలను వశపరచుకొనుశక్తి యేర్పడును. ఈ దశలోని బాలురు కష్టపడి పనిచేయుటకును, విద్య నభ్యసించుటకును తగినవారగుదురు. ఈ దశలో బాలుర కుపయోగకరమైన విద్యను మాత్రమే నేర్పవలెను. అర్థముగానట్టియు, నిరుపయోగమైనట్టియు విషయములను ప్రణాళికలో జేర్చక భౌతికశాస్త్రములను మాత్రమే జేర్చవలెను. క్రొత్త వస్తువులను గురించి నేర్చుకొనవలెననెడి కోరిక, విషయములను పరిశీలించి తెలిసికొనవలెననెడి యభిలాషయు బాలుర కుండునుగాన వానిని విద్యాసాధనములుగా నుపయోగించుకొనవలెను. బాలురకు అర్థమగునట్లు ప్రశ్నలువేసి వారంతట వారే విషయములను గ్రహించునట్లు తోడ్పడవలయును. బాలురు తమంతట తామే విచారణజేసి వస్తువులను గురించి గ్రహించవలెనుగాని యుపాధ్యాయుని మాటపై నాధారపడగూడదు. సూర్య చంద్రులను గురించి, భూగోళమును గురించి బాలురు గమనించి నేర్చుకొనవలెనుగాని నకళ్ళు పటములుచూచి నేర్చుకొనుట యుక్తముగాదు. బాలురు పటములను స్వంతముగా తయారుజేయవలెను. అనుభవమే జ్ఞానార్జనకు మూలము. పాఠ్యపుస్తకముల నుపయోగించగూడదు. 'రాబిన్‌సన్ క్రూసో' యను పుస్తకము బాలురకు మిగుల ఉపయుక్తమైనది. బాలురకు వివిధమైన కళలు నేర్పుట, వర్తక విషయములను గురించిన జ్ఞానమిచ్చుట యావసరము. వడ్రంగము, కట్టుతో సామాను తయారుజేయుట బాలురకు నేర్పవలెను. దీని వలన వారి మానసిక, శారీరక శక్తులు అభివృద్ధి జెందును.

4. 15 నుండి 18 సంllల వరకు :- ఈ దశలోని బాలురు నైతిక విద్యను శిక్షణను పొందుటకు తగినవారగుదురు. విద్య స్వకీయమైన అభివృద్ధికి తోడ్పడును. సంఘములో మెలగుట

తోడి వారితో కలిసిమెలసి యుండుట బాలురు నేర్చుకొందురు. ఇంతవరకు బాలుర శరీరములు, ఇంద్రియములు, తెలివి తేటలను గురించి శ్రద్ధవహింపబడును. ఈ దశలో వారి హృదయమునకు శిక్షణ ఈయబడును. బాలుర నిజమైన జీవితము ప్రారంభ మగును. శీలము, దయ మొదలైన గుణములు ప్రజలతో సాంగత్యమువలన వారు నేర్చుకొందురుగాని యుపదేశమువలనగాదు. వైద్యశాలలు, బీదలు నివసించుస్థలములు, బాలునికిజూపి బీదవారి స్థితిని గ్రహింపజేయవలెను. చరిత్రను బోధించి ప్రపంచమును గ్రహించునట్లు జేయవలెను. సంఘములోని వివిధ మానవులతో సాంగత్యము కలుగజేసి, యనుభవమువలన ఫలితములను గ్రహింప జేయవలెను. నైతికజ్ఞానముకూడ అనుభవముచేతనే నేర్పదగును. ఇదివరకు దశలలో వారికి ప్రకృతిజ్ఞానము కలిగినదిగాన ప్రకృతి యొక్క సృష్టికర్తనుగురించి తెల్పవలెను.

ఐదవ భాగము (స్త్రీ విద్య)

5. స్త్రీకి శరీర సౌందర్యము పెంపొందజేయుటకును, దృఢశరీర నొనర్చుటకును శరీర శిక్షణ యవసరము. ఆమెకు కుట్టుపని, జరీపని, దారములతో అల్లుట, చిత్ర విచిత్రమైన బొమ్మలు వేయుట, గానము, నృత్యము నేర్పవలయును. కష్టపడి పనిచేయు స్వభావము, విధేయత యలవడజేయవలయును. భర్త మనస్సు కనిపెట్టి నడచునట్లు శిక్షణ నీయవలెను. మతవిద్య బోధించవలెను. ఇతర విద్యల నేర్వకున్నను పురుషుల స్వభావము గుర్తెరిగి సంచరించు నైపుణ్యము స్త్రీ నేర్వవలయును.

పై నుదాహరించిన విధమున పురుషులకు సహజ వ్యక్తిత్వమును వృద్ధిజేయు విద్యయు, స్త్రీలకు స్వాతంత్ర్యరహితమైన యడకువ నేర్పు విద్యయు బోధింపవలెనని రూసో తాను రచించిన "ఎమిలీ" యను పుస్తకములో ప్రతిపాదించెను.

వాఙ్మయ, సాంఘిక విషయములనుగురించి రూసో అభిప్రాయములు :

అతని విద్యావిధానము ఆకాలపు నాగరికతలోను, సాంఘిక పరిస్థితులలోను విప్లవము కలుగజేసెను. పుస్తకములు, పుస్తకరూపమున నున్న పూర్వజ్ఞానమును త్రోసివేసి, యతడు పరిశీలనాశక్తికి, గ్రహణశక్తికి, శరీరదార్ఢ్యముకు నెక్కువ ప్రాధాన్యమిచ్చెను. బాలుర మానసికతత్వమును తెలిసికొనలేకపోయినప్పటికిని, దానిని దెలిసికొనుటకై పరిశ్రమ చేయవలయునని ప్రోత్సహించెను. అందుచేతనే ప్రస్తుత కాలములో బాలతత్వమును గ్రహించవలెనని విద్యావేత్త లభిప్రాయపడుచున్నారు. రూసో బాలతత్వమును గురించి యెన్నియో వివరములనిచ్చి ఆతని తర్వాతవచ్చిన విద్యాసంస్కారులకు మార్గదర్శియయ్యెను. వేర్వేరు దశలలో బాలుర గుణములు వేర్వేరుగా నుండునని చూపెట్టెను. మతమును, సాంప్రదాయముగా వచ్చు నాచారమును గ్రోసిరాజని, నిర్మలమై, ఉన్నతమైనట్టి సహనము, సామరస్యము ఆదర్శముగా జూపెను.

రూసో అభిప్రాయముల వలన విద్యావిధానములో మార్పులు

అతని యభిప్రాయముల ఫలితముగా పాఠశాలనిర్వహణము, బోధనాపద్ధతి, ప్రణాళికలో గొప్పమార్పులు గలిగెను. ప్రస్తుత విద్యాపద్ధతులకు ఆతడే మార్గదర్శి. అసహజమైనట్టియు, సాంప్రదాయయుక్తమైనట్టియు విద్యావిధానముల నతడు తృణీకరించెను. మానవసౌఖ్యమునకు తోడ్పడు విద్యావిధానము రూసోవలన ఆదరణలోనికి వచ్చెను. సాంఘికజీవనమును పెంపొందజేయుటకు వలసిన గుణముల నేర్పుట, వృత్తివిద్యయొక్క ప్రాధాన్యము మున్నగు విద్యాప్రయోజనము లన్నిటికి బీజములు 'ఎమిలీ'లో కానబడును. పిల్లల మానసిక తత్వమును తెలిసికొనవలెననెడి యభిప్రాయమును చాటినవా

డితడే. బాలుర మానసికదశల కనుగుణముగా వారికి నేర్పు విద్యావిషయము లుండవలెనని చెప్పినదియు నీతడే. ప్రారంభ దశలోని బాలురకు శరీరము నభివృద్ధిపరచు నాటలు, పనులు అవసరమనియు, వానిమీదనే బాలుర పురోభివృద్ధి యాధారపడి యుండుననియు ప్రజలు గ్రహించునట్లు చేసెను. అసహ్యమైన విద్యాపరిస్థితులను దొలగించుటకై ప్రకృతితో సంబంధము, పరిచయము అవసరమను అభిప్రాయము వెల్లడిజేసెను. ఇతని యభిప్రాయముల మూలముననే పాఠశాలలలో ప్రకృతి పరిసరములు, మొక్కలు, జంతువులు మొదలగునవి ప్రదర్శనశాలలో జేర్పబడినవి.

# పెస్టాలొజి



## 1746 మొ॥ 1826 వరకు

పెస్టాలొజియొక్క ప్రారంభ జీవితము:

పెస్టాలొజి 1746 లో స్విట్జర్లెండులోని జ్యూరిక్ అనుచోట జన్మించెను. అతని తండ్రి చనిపోవుటచేత తల్లియే అతని పెంచెను. ఆమె దైవభక్తి పరాయణురాలు. స్వార్థరహిత. అందుచేత ఆమె శిక్షణ అతనికి చాల ప్రయోజనకరమయ్యెను. తల్లిచే శిక్షణ బడయుటచేత అతని అభిప్రాయములలో మార్పులు కలిగినవి. పాఠశాల ఆదర్శప్రాయమగు ఇంటివలె నుండవలె ననియు, విద్య హృదయమునకు, మనస్సునకు, చేతికి తగుశిక్షణ ఇవ్వవలెననియు అతడు తలంచెను. తల్లులే ఆదర్శప్రాయులగు ఉపాధ్యాయురాండ్రను భావము అతనికి కలిగెను. తల్లిచేత పెంపబడుటవల్ల అతడు సుకుమారస్వభావుడై కార్యాచరణయందు దక్షతలేనివాడయ్యెను. తాతవలనగూడ ఇతని జీవితములో కొన్ని మార్పులు గలిగెను. తాత పురోహితుడగుటచే గ్రామములో తిరుగుట, బీదసాదలను, రోగులను వారి కష్టనిష్ఠురములను చూచుట సంభవించెను. దుస్థితిలోనున్న పేదవారిని ఉద్ధరింపవలెనని సంకల్పించెను. ఈ ఉద్దేశ్యముతో అతడు తన తాత వృత్తిని స్వీకరించెను. కాని ఉపన్యాసధోరణి లేకపోవుటచేత పురోహితవృత్తినివదలి న్యాయవాదవృత్తిని మొదలిడెను. కాని ఇందులోగూడ అతని కపజయమే కల్గెను. రూసో గ్రంథములను చదువుటవలన ప్రభుత్వమును ఖండింపసాగెను,

1769 వ సంవత్సరములో వ్యవసాయవృత్తి నవలంబించెను. కర్షకులకు వ్యవసాయము క్రొత్త పద్ధతుల ననుసరించి ఎట్లు సాగించవలెనో నేర్పసమకట్టెను. బర్ అను స్థలమున కొంత భూమిని తీసికొని సేద్యమును మొదలిడెను. కాని ఈ వృత్తిలోగూడ అతనికి జయము చేకూరలేదు. ఇంతలో అతనికొక కుమారుడు జన్మించెను. ఆ పిల్లవానిని రూసో రచించిన ఎమిలి అను బాలునివలె పెంచసాగెను. తన అనుభవమును అభిప్రాయములను విద్యాసూత్రములను "Father's Journal" అను మాసపత్రికలో ప్రచురింపసాగెను. కేవలము పుస్తకముల మూలముననే జ్ఞానము కలుగదనియు, బీదవిద్యార్థులుగూడ తగిన శిక్షణ బొందినచో జ్ఞానార్జనమేగాక, ద్రవ్యార్జనకుకూడ దారి దొరకునని తలంచెను.

న్యూహాఫ్‌లో లోకోపకారార్థమై స్థాపించిన పాఠశాల

పెస్టాలొజి తన వ్యవసాయ ప్రయోగములలో విజయమును సంపాదింపలేకపోయెను. అయినప్పటికిని తన సంకల్పమును నెఱవేర్చుటకై లోకుల కుపయోగార్థము ఒక పాఠశాలను స్థాపించి విద్యనేర్ప మొదలిడెను. 20 మంది పేద విద్యార్థులను దగ్గరకుతీసి వారికి తిండియు బట్టయు ఉచితముగా నొసగి బోధింప మొదలిడెను. బాలురకు వ్యవసాయములోను తోటపనిలోను, బాలికలకు గృహనిర్వహణములోను కుట్టుపనిలోను శిక్షణ నిచ్చుచుండెను. బాలబాలికలు పనిలో నిమగ్నులై యున్నపుడు వారికి చదువుట, వ్రాయుట, సంభాషణ నేర్పుచుండెను. ఈ విధముగ పెస్టాలొజి పాఠశాలల్లో సామాన్యవిద్యతోపాటు చేతిపనులుకూడ నేర్పుచుండెను. ఇట్టి యత్నములు చేసినవారిలో ఇతడు మొట్టమొదటివాడు. కొన్ని మాసములలోనే బాల బాలికల శరీరములోను, మనస్సులోను, ప్రవర్తనలోను గొప్పమార్పు కలిగెను. వారికి హస్తలాఘవముకూడ గలిగెను; ఈ ప్రయోగా

గము విజయవంతమైనప్పటికి ఆర్థికదుస్థితివలన పెస్టాలొజి తన పాఠశాలను మూయవలసివచ్చెను.

విద్యమూలమున సంఘసంస్కరణ చేయవలెనను సంకల్పము పెస్టాలొజిని వీడలేదు. విద్యనుగూర్చిన తన యభిప్రాయములను "సన్యాసియొక్క సాయంసమయము" "The Evening Hours of a Hermit" అను పుస్తకరూపమున ప్రకటించెను. కాని జనసామాన్యమునకు అది అర్థము కానందున ఆ అభిప్రాయములనే "లియోనార్డు అండు గర్ట్రూడు" అను పుస్తకరూపమున తిరిగి ప్రకటించెను. ఈ పుస్తకములో బోనాల్ అను కల్పితగ్రామములోని సాంఘిక పరిస్థితులు వర్ణింపబడెను. "గర్ట్రూడు" అను స్త్రీ ఆ గ్రామములో ఏ విధముగా సంస్కరణచేసినది వ్రాయబడెను. ఆమె తన భర్తను మంచి మార్గములో పెట్టుటయేగాక తన పిల్లలకు విద్యనేర్పెను. సంఘములో పలుకుబడిని సంపాదించెను. మార్పులు కలుగజేసెను. గర్ట్రూడుచేసిన పనిని ఒక ఉపాధ్యాయుడు మెచ్చుకొని పాఠశాలను నడుపు విధానము ఆమెవద్ద నేర్చుకొనెను. క్రమముగా ఇతర స్థలములలోగూడ ఆమె పద్ధతుల ననుసరించి విద్యావ్యాప్తి కలుగజేయబడెను. ప్రభుత్వమువారి దృష్టినిగూడ ఆమె విధానములు ఆకర్షించెను. ఆమె బోనాల్ అను గ్రామములో అవలంబించిన విధానమునే ప్రభుత్వమువారుగూడ అవలంబించి రాష్ట్రములో విద్యాభివృద్ధికి చేయూతనిచ్చిరి. ఈ పుస్తకములోని విషయములు కల్పితములైనను సాంఘిక, రాజకీయ, విద్యావిషయములలో మంచి సూచనలు ఇచ్చెను.

స్టాంజ్ పాఠశాల మఱియు పెస్టాలొజియొక్క పరిశీలనాపద్ధతులు

1798 వ సంవత్సరములో స్విట్జర్‌లాండ్‌లో ప్రజాప్రభుత్వ మేర్పడెను. పెస్టాలొజి సంఘసంస్కర్తగావున్న ప్రజాప్రభుత్వమునకు సహాయపడెను. అతడు రాజకీయములలో జోక్యము కలుగజేసికొనక తన విద్యాసూత్రములనుగూర్చి

ప్రయోగములు, పరిశోధనలుచేయ నిశ్చయించెను. స్టాంజ్ అను గ్రామములో నొక పాఠశాలను నెలకొల్పి కొంతమంది అనాథ బాలురను పాఠశాలలో చేర్చెను. న్యూహాఫ్ పాఠశాలలోవలెనే బాలుర క్రమ క్రమముగా శారీరిక, నైతిక, మానసిక అభివృద్ధిని జూపిరి. పెస్టాలోజియందు వారికి ప్రేమ గౌరవములు హెచ్చెను. పెస్టాలోజి పురాతన బోధనాపద్ధతులను ఖండించి క్రొత్త పంథా నవలంబించెను. బాలురకు పుస్తకములద్వారమున విద్య నేర్పుట మంచిదికాదనియు, అనుభవము, పరిశీలనలే విద్యార్జనకు ముఖ్య మార్గములనియు తలంచెను. నైతిక, మత విద్యలను విధి నిషేధ ములచేగాక అనుభవముచేత నేర్చెను. ఇంద్రియ నిగ్రహము, దానము, సానుభూతి, కృతజ్ఞత మొదలైన గుణముల విలువ బాలురకు తెలిపెను. గణితము, భాష బోధించునపుడు వస్తువు లను ప్రదర్శించెను. చరిత్ర, భూగోళము పుస్తకములలో చదివిం చుటయేగాక బాలురకు వర్ణించిచెప్పెను. ప్రకృతిసంబంధమైన విష యములు పరిశీలింపజేసి బాలురకు నేర్పెను. పరిశీలనను సులభపర చుటకై యత్నించెను. వర్ణక్రమపద్ధతిని అనుసరించి చదువుట నేర్పెను. విషయమునకుగల పరస్పరసంబంధము జూప యత్నించెను. సామాన్య విద్యకును చేతిపనికిని సంబంధము గలుగజేసెను. పాఠశాలకును, కర్మాగారమునకును సంబంధము గలుగజేసెను.

**బర్గ్‌డాఫ్ పాఠశాలను అందలి విద్యను మానసికతత్వముపై ఆధారపరచుట.**

పెస్టాలోజీ స్టాంజ్ పాఠశాలలో ప్రారంభించిన పద్ధతులను, సూత్రములను బర్గ్‌డాఫ్ పాఠశాలలో అభివృద్ధిపరచెను. అతను గొప్ప విద్యావేత్త అయినను ఉపాధ్యాయునికి ఉండవలసిన కొన్ని లక్షణములు అతనిలో లేకుండెను. అతని భాష అస్పష్టముగ నుండెను. వ్రాత అసహ్యముగనుండెను. చిత్రలేఖనములో అతనికి పరిచయము లేకుండెను. వ్యాకరణమన అతనికి తలనొప్పి. ప్రకృతి సంబంధమైన పుస్తక

ములు చదివినను, శాస్త్రయుక్తమైనజ్ఞాన మతనికి లేకుండెను. గణితమునందు పరిచయము చాల తక్కువ. రేఖాగణితము అతనికి తెలియదు. ఇన్ని లోపములున్నప్పటికిని అతడు పట్టుదలతో తన ప్రయోగములను కొనసాగించెను.

బర్గ్ డాఫ్ పాఠశాలలో పఠనము, గణితము సులభపఱచుటకై ప్రయత్నించెను. బాలుర మానసికతత్వములూ, చిత్తవృత్తులూ దృష్టియందుంచుకొని సులభమైన అభ్యాసములను సిద్ధపఱచెను. వర్ణక్రమపద్ధతిని సిద్ధపఱచెను. బాలురకు బోధించుటకుపయుక్తములగు కదిలికగల అక్షరములు సృష్టించెను. వారికి భాషాజ్ఞానము కలుగజేయుటకు వస్తువులను ప్రదర్శించి వాటిసంఖ్య ఆకారము, ఉనికి, రంగు మొదలైనవి చిన్నవాక్యములలో చెప్పుచుండెను. గణితబోధనలోగూడా పెస్టాలొజి కొన్ని పరిశోధనలు చేసెను. సంఖ్యలను, స్థానములను తెలుపుటకై చదరపుగళ్ళు అట్టలపైగీచెను. దానిమూలమున బాలుడు స్థానములోగల భేదమును, అర్థములను గ్రహించును. సంకలనము, వ్యవకలనము, గుణకారము, భాగహారము వస్తురూపముగా బాలురకు బోధించెను. రేఖా గణితముగూడ వస్తురూపమునసే బోధించెను. చరిత్ర, భూగోళము, ప్రకృతిపఠనము బోధించునపుడు పరిశీలనకు ప్రాముఖ్య మొసగెను.

పెస్టాలొజి తన బోధనను మానసికతత్వముపై ఆధారపఱచెను. అనగా బోధనావిధానము మానసికాభివృద్ధికి తగినట్లు నిర్ణయించెను. జ్ఞానమును సులభరీతి నవలంబించి బోధింపవలయుననెను. బాలుడు సులభముగా గ్రహించునట్లు శాస్త్రయుక్తముగా కొన్ని అభ్యాసములను, మెట్లను సిద్ధపఱచెను. పరిశీలనమూలమున విద్య నభ్యసించుటకు అవకాశ మీయబడెను.

పై నుదహరించిన పరిశీలనాపద్ధతులవల్లను, మానసికతత్వ జ్ఞానమువల్లను పెస్టాలొజి తన పాఠశాలలోని విద్యార్థుల కుచిత రీతిని బోధించుటచేత వారు అనతికాలములోనే మంచి శక్తి సామర్థ్యములు చూపగలిగిరి. ప్రభుత్వముగూడ అతని కృషిని శ్లాఘించి తగిన బహుమానము నొసంగెను.

పెస్టాలొజి తాను అనుభవముచేత గడించిన బోధనా విధానమును ఒక పుస్తకరూపమున ప్రచురించెను. ఆ పుస్తక మునకు "గర్ట్రూడు తన పిల్లలకు బోధించేవిధానము" అని పేరిడెను. ఆ పుస్తకము పదిహేను లేఖల రూపమున నుండెను. మొదటి రెండు లేఖలు పెస్టాలొజియొక్క జీవితచరిత్రను వివరించును. తక్కిన లేఖలు అతని సామాన్యసూత్రములను, భాష, చిత్రలేఖనము, వ్రాత, కొలత మొదలగునవి పరిశీలనవలన నేర్పు విధానమును వర్ణించెను. తదితర లేఖలు ప్రాథమికవిద్యను సంస్కరించు విధానము, నైతిక మతవిషయములను అభివృద్ధి పఱచు మార్గములను సూచించును. ఈ పుస్తకము అతని విద్యావిధానమునకు మార్గదర్శిని. ప్రస్తుత ప్రాథమిక విద్యా సంస్కరణకు వలయు సూచనలుగూడ ఇందు గానబడును. అందు లోని కొన్ని ముఖ్యవిషయములు ఈ క్రింద వివరింపబడెను.

1. పరిశీలన బోధనకు పునాది.
2. పరిశీలనకును భాషకును సంబంధము గలుగజేయ వలెను.
3. బోధన సులభమైన పద్ధతులమీద ప్రారంభింపబడి బాలురయొక్క మానసికాభివృద్ధితోపాటు క్రమముగా పెంపొందవలయును.
4. బోధనను బాలురు గ్రహించుటకు ఒక్కొక్కదశను దాటగానే కొంత వ్యవధి కలుగజేయవలెను.

5. బోధన క్రమాభివృద్ధి సూత్రమును అనుసరించవలెను.
6. ఉపాధ్యాయుడు బాలుర వ్యక్తిగత సామర్థ్యములను గుర్తించవలయును.
7. ప్రాథమిక విద్యయొక్క ఉద్దేశ్యము కేవలము జ్ఞానము కలుగజేయుటయేగాదు. బాలురయొక్క మానసిక శక్తులను పెంపొందజేయుటయే.
8. జ్ఞానముతోపాటు బాలురకు దానివలన లాభము పొందుటకును దానిని అనుభవములోనికి తెచ్చుకొనుటకును అవకాశము గలుగజేయవలయును. అనగా నిత్యజీవితములో తాము సంపాదించిన జ్ఞానమును వినియోగించుకొనవలయును.
9. క్రమశిక్షణ ప్రేమమీద ఆధారపడునట్లు జేయవలెను, అనగా గురు, శిష్యులు ఒండొరుల ప్రేమించుకొనవలెను.
10. విద్యయొక్క ఉద్దేశ్యమును లక్ష్యము నందుంచుకొనవలయును.

యావర్డన్ పాఠశాల; పెస్టాలొజి యొక్క పరిశోధనల విజయము:

స్టాంజ్, బర్గ్‌డాఫ్ పాఠశాలలలో ప్రారంభింపబడిన కార్యక్రమము యావర్డన్ పాఠశాలలో పూర్తిచేయబడెను. ఈ పాఠశాల పెక్కు విద్యా ప్రయోగములకు కేంద్రమయ్యెను. ప్రారంభపాఠశాలలలోని విద్యాసమస్యలు పరిష్కరింపబడెను. పరిశీలనయే ముఖ్య విద్యాసూత్రముగా పరిగణింపబడెను. యుక్తమగు పరిశీలనా విధానము బాలురకు నేర్పబడెను. పరిశీలనవలన వారు వస్తువులకును, శబ్దములకును గల సంబంధమును గుర్తెరిగి తమ యభిప్రాయములను ఎట్టి కష్టములు లేక సులభముగా వెలిబుచ్చగలుగుచుండిరి.

గణితములోగూడ అతనికృషి ఆదర్శప్రాయముగ నుండెను. భిన్నములమానము మఱింత సులభపఱచుటకు పరిశోధన సలుపబడెను. నిదర్శనయుక్తముగ భిన్నమానము చూపబడెను. పెక్కుచదరము లుపయోగింపబడి, అవి వివిధములుగ—అనగా పొడుగునను, అడ్డముగను—విభజింపబడెను. కొన్ని నిండు గళ్ళు మొదటచూపి, అటుపిమ్మట వానిని రెండు, మూడు, నాలుగు మొదలగు భాగములుగ విభజించి చూపబడెను. బాలురు ఈ పరిశీలన వలన చౌకమననేమో, వాని భాగములననేమో తెలిసికొనగలుగుటయేగాక అవియన్నియు గలసి పూర్ణసంఖ్య ఎట్లగునోకూడ గుర్తించగలుగుచుండిరి. ఇంతియేగాక పెస్టాలొజి మిశ్రమ భిన్నముల మానముగూడ సిద్ధపఱచెను. సంఖ్యలవిషయమై అతడు చేసిన పరిశోధన చాల గొప్పది. వ్రాయుట నేర్పుటకు ముందు బాలురకు కొన్ని ఆకారములు నేర్పబడెను. ఆ ఆకారముల మూలమున అక్షరములు వ్రాయుటకు కొన్ని అభ్యాసములు క్రమపద్ధతిని నిర్ణయించబడెను. తిన్ననివి, వంకరవి మున్నగు ఆకారములు నేర్పుటకై పుల్లలు, పెన్సిళ్ళు ఉపయోగించి, పలకల మీదను, నల్లబల్లమీదను గీతలు గీయబడుచుండెను. అక్షరములు వ్రాయగలుగుటకు మొదట చిత్రలేఖనము బోధింపబడెను. సులభమైన అక్షరములు మొదట ప్రారంభింపబడెను. మొట్టమొదట పలకలమీదను, తదుపరి కలములతో కాగితములపైనను వ్రాయుట నేర్పబడెను. చదువుట వ్రాయుట కొంచె మించు మించుగా ఒకేసమయమున ప్రారంభించబడెను. రేఖాగణితము నేర్చుటకు చిత్రలేఖనాజ్ఞానము పనికివచ్చుచుండెను. బాలురకు వివిధములైన రేఖలను గుఱించియు కోణము, తదితర రేఖాగణితమునకు సంబంధించిన ఆకారములు నేర్పబడుచుండెను. ఈ ఆకారములు అట్టతోగాని, కొయ్యతోగాని సిద్ధబఱచి బాలురకు ప్రదర్శింపబడుచుండెను. సృష్టిపరిశీలన, భూగోళచరిత్రములు

గూడ పరిశీలన ద్వారమున నేర్పబడుచుండెను. మతము, నీతి ఆదర్శములద్వారా ఆచరణమూలమున నేర్పబడుచుండెను. తల్లిని ప్రేమించిన విధముననే భగవంతునిగూడ ప్రేమించవలెనని బోధించెను. ఈ విధముగ పెస్టాలొజి ప్రాథమిక పాఠశాలల కుపయుక్తమగు ఎన్నియో సమస్యలను ప్రయోగముల మూలమున పరిశోధించెను. కాని అతనికి నిర్వహణశక్తి లేనందున యావర్డన్ పాఠశాలను చివరకు మూసివేయవలసి వచ్చెను.

**విద్యనుగూర్చి పెస్టాలొజి అభిప్రాయములు**

పెస్టాలొజి రూసోవలెనే ప్రకృతిసూత్రముల ననుసరించెను. మానవులలోనుండు ఉత్తమ శక్తి సామర్థ్యము లన్నియు శిక్షణబొంది పెంపొందునని తలంచెను. అదృష్టమునం దతనికి నమ్మకము లేకుండెను. మానవుని శక్తులన్నియు స్వతస్సిద్ధములని తలంచెను. బాలురయొక్క క్రమాభివృద్ధి మొక్కలు, జంతువుల యొక్క అభివృద్ధితో పోల్చెను. మానవులలోనుండు అన్నిశక్తులను సహజముగను సమానముగను అభివృద్ధిపరచుటయే విద్యయొక్క ముఖ్యోద్దేశమని అతని భావము. ఆ యా దశలలో నుండు బాలుర మానసికశక్తులను గ్రహించి వాని కనుగుణము లగు విషయములను బోధింపవలెనని తలంచెను. విషయక్రమము బాలురయొక్క వయస్సునకును మానసికశక్తికిని తగినట్టులుండవలెను. విద్యాపద్ధతి యంతయును ప్రకృతి ననుసరించియుండవలయును. పూర్వసాంప్రదాయములను, పద్ధతులను అతడు నిరసించెను. ఆ కాలములో బాలురకు మాటలు చదువనేర్పుట, గణితములోని విషయములను జ్ఞప్తియందుంచుకొనుట నాగరికతకు సంబంధించిన కొంత బాహ్యజ్ఞానమును గలుగజేయుట, ముఖ్యాంశములుగా పరిగణింపబడుచుండెడివి. పాఠశాలలో మానసికతత్వజ్ఞానమునకు స్థానములేకుండెను. ప్రకృతి పద్ధతులకు విరుద్ధములగు వానిని అవలంబించుచుండిరి. గొఱ్ఱెలవలె బాలురను కొట్టములో

స్వేచ్ఛాహీనుల నొనర్చి ఉంచుచుండిరి. ఈ పరిస్థితులను పెస్టాలొజి సంస్కరింప సమకట్టెను.

అతని పద్ధతులు, వాటి ఆచరణ: బాలుర సహజశక్తులను అభివృద్ధిపఱచి సంఘసంస్కరణ చేయవలెననిన బాలురకు పరిశీలనను గుఱించి తగిన శిక్షణ ఇవ్వవలెనని పెస్టాలొజి తలంచెను. ఇంద్రియానుభవముల వలననే స్వచ్ఛమైన అభిప్రాయములు వారికి ఏర్పడును. ఏ విషయమును బోధించినను ఇంద్రియములను బాహ్యవస్తువుల వైపునకు మరల్చి బోధింపవలెను. ఇట్టి వస్తుపాఠములు అతనికి పూర్వము పాఠశాలలో నుండెడివిగావు. వస్తుపాఠమునకు వలయు సామగ్రి పాఠశాల కిరుప్రక్కలనే లభించుననియు, నిత్యజీవితములో నవసరమైనట్టియు, అనుభవములో నున్నట్టియు వస్తువుల నుపయోగించవలయుననియు అతని యభిప్రాయము. ప్రతి అంశమును సులభమైన శీర్షికలు లేక భాగములుగా విభజించి, సులభమైన అభ్యాసములరూపమున క్రమాభివృద్ధిగా బోధింపవలెను. బాలురకు పదములతో పరిచయము కలుగజేయుటతో మాత్రము తృప్తినొందక వస్తువులతో పరిచయము గలుగజేయవలయును. వారి అనుభవములను తేటతెల్లముగ వర్ణించునట్లు జేయవలయును. ఈ విధముగ పెస్టాలొజి పరిశీలనకును, భాషకును సంబంధము కలుగజేసెను. పరిశీలన, విభజన, భావప్రకటన అను విధానమును వర్తింపజేసి పెస్టాలొజి బాలురయొక్క సహజ అభివృద్ధికి తోడ్పడెను. భాష సంభాషణవలననే నేర్పవలెను గాని వ్యాకరణమాత్ర బోధనవలన గానేరదు. గణితబోధనకు, పరిశీలనకుగూడ పెస్టాలొజి సంబంధము గలుగజేసెను. సంఖ్యలు, వాటికి సంబంధించిన విషయములను, వస్తువులను ప్రదర్శించి బోధించెను. స్థానములు, భిన్నములు, మిశ్రమ భిన్నములు నేర్పుటకు తగు ఉపకరణములను నిర్మించెను. అక్షరాకారములను నేర్పిన విధప చిత్రలేఖనమును,

వ్రాత, రేఖాగణితమును బోధించెను. ప్రకృతి పఠనము, చరిత్ర, భూగోళము చుట్టుప్రక్కలనుండు వస్తుసముదాయమును పరిశీలింప జేసి బోధించెను. మత, నైతికవిషయములను నిదర్శన యుక్తముగ అనుభవములోని సంగతులవైపునకు దృష్టిమరల్చి బోధించెను.

అతని క్రమశిక్ష కఠినముగ నుండక మృదువుగా నుండెను. పాఠశాల సాధ్యమైనంతవఱకు ఇంటివలె నుండవలెనని తలంచెను. భయమునకు తావివ్వక క్రమశిక్షకాతడు ప్రేమను దయను ఆధారము చేసెను. అతడెప్పుడును బాలురను శిక్షించి ఎఱుగడు.

# ఫ్రోబెల్

## క్రీ. శ. 1782 — 1852

బాల్యము, విద్యాభ్యాసము:

జర్మనీలో తురంగియా అడవిలోని ఒక గ్రామమం దీతడు జన్మించెను. తండ్రి మత గురువగుటచే మతసాంప్రదాయము కొంతవర కతని కబ్బెను. తండ్రి తన వృత్తిలో మునిగియుండుటవల్లను, తల్లి సవతితల్లి యగుటచేతను అతనికై శ్రద్ధజూపువారు లేకుండిరి. అడవులలో దిరుగుచు పక్షులు, అడవిజంతువులు, వృక్షములు మొదలగు ప్రకృతి విషయములను పరిశీలించుచు వాటినిగురించి ఆలోచించుచుండెను. క్రమముగా సృష్టిలోని రహస్యములను ఐక్యమును కనుగొనవలెననెడికోరిక యతని కుదయించెను. ఇట్టి ఐక్యము లేక సంబంధము విద్యావిధానమునందుగూడ నుండితీర వలెనని యతడు తలంచెను. 17 సం॥ ప్రాయమున నతడు అటవీ శాఖలోనియొక ఉద్యోగివద్ద పని నేర్వ మొదలిడెను. క్రమముగా ప్రకృతియం దనురాగము జ్ఞానము అభివృద్ధిజెందెను. సమీపములోనున్న యొకవైద్యునివద్ద వైద్యసంబంధమైన పుస్తకములు చదివి వృక్షశాస్త్రమునుగురించి శాస్త్రయుక్తమగు జ్ఞానము సంపాదించెను.

ప్రకృతి శాస్త్రజ్ఞానమును పెంపొందజేసికొనవలెనను కోరిక యధికమగుటచే నతడు తన తల్లిదండ్రుల యాజ్ఞను లక్ష్యము చేయక జీనా విశ్వవిద్యాలయములో ప్రవేశించెను. ఆ కాలములో నది జర్మనుల వేదాంతమునకును శాస్త్రములకును

కేంద్రమైయుండెను. ఫ్రోబెల్ మంచి వాతావరణములో నుండుటచే జ్ఞానము నార్జించెను. ఆ కాలపు తత్వశాస్త్రజ్ఞుల, రసాయన శాస్త్రజ్ఞుల, మహాకవుల యభిప్రాయములతని హృదయములో మార్పుగలుగజేసెను. రెండు సంవత్సరములు మాత్రము జీనా విశ్వవిద్యాలయములోనుండి ఆర్థికపరిస్థితుల వలన విద్యను చాలించెను.

**ఉపాధ్యాయవృత్తి, పెస్టాలొజీతో సంబంధము :** సుమారు నాలుగు సంవత్సరములు ఒకటితర్వాత మఱియొక వృత్తి నవలంబించెను. కొంతకాలము వ్యవసాయము, భూమికొలత, గుమాస్తాగిరి, తుదకు జమీందారీ భూముల నిర్వహణము మొదలగు పనుల నిర్వర్తించెను. తుట్టతుదకు క్రీ. శ. 1805 సంవత్సరములో పెస్టాలొజీ పద్ధతుల ననుసరించి పాఠశాల నడుపుచున్న డాక్టర్ గ్రూనర్‌ను సందర్శించెను. ఆ డాక్టరు ఫ్రోబెల్ యొక్క యభీష్టమును తెలిసికొనినవాడై, ఉపాధ్యాయవృత్తిని స్వీకరించుమని తన పాఠశాలలోనే స్థానమొసంగెను. ఫ్రోబెల్ ఉపాధ్యాయవృత్తిని నీటినిగ్రోలు చేపవలె హృదయపూర్వకముగా స్వీకరించెను. ఆ పాఠశాలలో నైదు దినములు పనిచేసిన పిదప తనకు ఉపాధ్యాయుని కుండవలసిన విషయజ్ఞానముగాని, మానసికాభివృద్ధి సూత్రజ్ఞానముగాని లేదని యెరిగి యీవర్డన్‌లోనున్న పెస్టాలొజి పాఠశాలను సందర్శింపబోయెను. అక్కడినుండి తిరిగి వచ్చి తన పాఠశాలలో పెస్టాలొజి విధానమును పరిశీలింప మొదలిడెను. మూడు సంవత్సరములు ఫ్రాంక్‌ఫర్ట్‌లో పనిచేసిన తర్వాత తిరిగి యీవర్డన్ పాఠశాలకు పెస్టాలొజీతత్వము నేర్చుకొనుటకై పోయెను. ఈ పాఠశాలలో సుమారు రెండు సంవత్సరములుండెను. భౌతిక భూగోళము, ప్రకృతిపఠనముల గుఱించి తగుశిక్షణ బొందెను. పిల్లల ఆటలను గమనించుటకును పరీక్షించుటకును అతని కవకాశము గలిగెను. ఆటలవలన బాలురకు

శారీరిక మానసిక శిక్షణ గలుగునని తలంచెను. ప్రారంభదశలో తల్లులచే శిక్షణ పొందుటయే అవశ్యమని భావించెను. పెస్టాలొజీ యొక్క లోపముల గుర్తించెను. అతని యభిప్రాయములలోగల అస్పష్టతకు నిర్వహణశక్తి, ఐక్యము లేకపోవుటయే కారణమని తెలిసికొనెను. ఈ లోపముల నివారించి తన గురువుయొక్క సూత్రములను, పద్ధతులను స్పష్టపరుపనిర్ణయించెను. యూవర్డన్‌లో నుండుటవలన ఉపాధ్యాయులకు తగు శిక్షణ యవసరమని గ్రహించెను. తన జ్ఞానమును మఱింత వృద్ధిపరుచుకొనుటకు యూవర్డన్ పాఠశాలనువదలి క్రీ.శ. 1811వ సంవత్సరములో గాటింజన్ విశ్వవిద్యాలయములో విద్యాభ్యాసము జేయమొదలిడెను. తర్వాత బర్లిన్ విశ్వవిద్యాలయములోజేరి కొంతకాలము విద్య నభ్యసించెను. క్రీ.శ. 1814లో ఆతడు సహాయ అధ్యాపకుడుగా పనిచేసెను.

**కెయిల్ హావో పాఠశాల:** ఫ్రోబెల్ విశ్వవిద్యాలయములో నున్నప్పుడు కూడ తన యొక్క ఆశయమైన విద్యాసంస్థలను మరువలేదు. ఇదిగాక బాలతత్వమును గుఱించి గూడ విచారము సలుపుచుండెను. శాస్త్రములతో పరిచయము వృద్ధియైనకొలది అతడు వివిధ విద్యావిషయములకు గల పరస్పర సంబంధమును మఱింత దృఢముగా తెలిసికొనుచుండెను. అతనికి స్టాక్‌హోమ్, బర్లిన్ విశ్వవిద్యాలయములో అధ్యాపకపదవి నిచ్చినను నిరాకరించి తన కిష్టమైన విద్యాసంస్కరణచేయ నిశ్చయించెను. తనకు బంధువులగు ఐదుగురు పిల్లల నొకచోటజేర్చి తన విద్యాభ్యసన సిద్ధాంతములను పరిశోధింప మొదలిడెను. ఈ పనిలో నతని కిరువురు సహాయులుగా నుండిరి. వారిలో మొదటివారు మిడన్‌డార్ఫ్, రెండవవారు ల్యాంగథల్. వీరు ముగ్గురుకలసి తురంగియా అడవుల సమీపముననున్న కేయిల్‌హావోవద్ద ఒక సంస్థను స్థాపించిరి. దానికి జర్మన్ విశ్వవిద్యాసంస్థ (The Universal German Institute of

Education ) అని పేరిడిరి. ఈ సంస్థ కొన్ని ముఖ్య ఆశయము లతో పని మొదలిడెను. అవి యేవన :—

(1) బాలుర మానసిక శక్తులను వారి స్వయంకృషివలననే సమానముగా అభివృద్ధిపరచుట.

(2) బోధించు వివిధ విషయములకుగల పరస్పర సంబంధ మును తెలుపుట.

(3) జీవితమునకును బోధించు విషయములకును సంబంధము కలుగజేయుట.

స్వీయమనోభావ ప్రకటన, నిరాటంకమైన యభివృద్ధి మొద లగునవి ఆ పాఠశాలకు ముఖ్య ఆశయములు. అచట ఆటలద్వారా శిక్షణ యివ్వబడెను. బయట గాలిలోను తోటలలోను పాఠశాల పరిసరములలోను అనుభవము చేకూర్చుపనులు బాలురచే చేయింపబడుచుండెను. బాలురు ఆనకట్టలు యంత్రములు కోటలు మొదలగువాని మాదిరులు సిద్ధపరచుచు అడవులలో జంతువులు, పక్షులు, కీటకములు, పువ్వులు మొదలగునవి వెదకుచుండిరి. నిత్య జీవితములోని పెక్కు చిక్కులు విడదీయుపద్ధతిని నేర్చుకొను చుండిరి. అద్భుతమైన కథలు గీతముల మూలమున భావనాప్రపం చమును దెలిసికొనుచుండిరి.

ఈ సంస్థమూలమున సంపాదించిన యనుభవము మానవ విద్య యను పుస్తకరూపమున ఫ్రోబెల్ ప్రపంచమునకు వెల్లడి జేసెను. అతని విద్యాతత్త్వము ఉత్కృష్టమైన విద్యాదర్శ ములు ప్రపంచ పరిణామసూత్రములు పై పుస్తకములో స్పష్టపరుప బడెను. ఇంతేగాక సృష్టివిషయమై ఫ్రోబెల్ యొక్క అభిప్రాయ ములు, మానవజీవితముయొక్క పరమావధి, విద్యాసూత్రముల యర్థము మొదలగు సంగతులుగూడ అందులో వివరింపబడెను. ప్రణాళికలో చేర్చవలసిన వివిధవిషయములు మానవజీవితమునకు సంబంధించినవిగా నుండవలెననిగూడ అతడు స్పష్టపరచెను,

అప్పటికాలపు ప్రజలు ఫ్రోబెల్ యొక్క నవీనాభిప్రాయముల నర్థము చేసికొనలేకపోయిరి. ప్రభుత్వముగూడ నతని సంస్థ విప్లవకారణమగునని భయపడి దానిని పరీక్షించుటకై యొక పరీక్షాధికారిని నియమించెను. కాని యా అధికారి యా విద్యాలయమును గుఱించి సుముఖముగా నభిప్రాయమిచ్చెను. కొంతకాలము తర్వాత ప్రజల అవిశ్వాసము వలనను, ద్రవ్యలోపమువలనను పాఠశాల మిక్కిలి క్లిష్టపరిస్థితులలోనికి వచ్చెను. అందుచేత ఫ్రోబెల్ ఆ పాఠశాలనువదలి క్రీ. శ. 1835 లో బర్గ్డాఫ్కోటలో నొక పాఠశాలను తిరిగి స్థాపించెను.

బర్గ్డాఫ్కోటలోని పాఠశాలలో పనిచేయుచుండగా ఫ్రోబెల్ ఆనాటి పాఠశాలలలో నేర్పు విద్యకు సరియైన పునాది లేదనియు, శిశువిద్యను గుఱించి తగిన ఏర్పాట్లు చేయనంతవరకు విద్య అభివృద్ధి గాంచదనియు తలంచెను.

కమీనియస్ రచించిన శిశుపాఠశాలయను పుస్తకము చదువుటచే తల్లులకు తగిన శిక్షణ యవసరమని ఫ్రోబెల్ గ్రహించెను. ఇంతేగాక ఆటలయొక్క విద్యాప్రాముఖ్యముగూడ స్పష్టముగా గోచరమయ్యెను. కావున నతడు చిన్నపిల్లల యభివృద్ధికారకములగు ఆటలు, ఆటవస్తువులు, పాటలు, శారీరిక చలనములగుఱించి పరిశీలించి వలయు సామగ్రిని నిర్మింపసాగెను.

**బ్లాకెన్‌బర్గ్ పాఠశాల :** రెండేండ్ల తర్వాత అతడు కేయిల్‌హోకు సమీపమునసుండు బ్లాకెన్‌బర్గ్ అనుచోట ఒక పాఠశాలను స్థాపించెను. దానిలో మూడు సంవత్సరములు మొదలు ఏడు సంవత్సరముల ప్రాయముగల పిల్లలకు బోధింపమొదలిడెను. ఆ పాఠశాల సుందరమైన తురంగియన్ అడవిప్రాంతములలో నుండెను. కొంతకాలమైన పిదప దీనికే కిండర్‌గార్టన్ పాఠశాలయని నామమిడిరి,

ఫ్రోబెల్ ఇదివర కుపయోగించిన ఆటవస్తువులను తదితర మార్గములను ఈ పాఠశాలలో ప్రవేశపెట్టి తన పద్ధతిని మఱింత వృద్ధిపరచెను. ఈ పద్ధతిలో ముఖ్యాంశములు మూడు గలవు.

(1) తల్లులకును పిల్లలకును ఉపయుక్తములగు ఆటలను గుఱించి గీతములు నేర్పుట.

(2, బహుమతుల ఉపయోగము.

ఈ బహుమతులు రేఖాగణితమునకు సంబంధించిన ద్యాకారములు. ఉ॥ స్థూపము, గోళము, ఘనము, గోపురాకారము మొదలైనవి.

(3) వృత్తులు లేక పనులు.

బ్లాకెన్‌బర్గ్‌లోనున్న ఏడు సంవత్సరములలో ఫ్రోబెల్ పెక్కు ఆటవస్తువులను కల్పించెను. క్రీ. శ. 1843 లో అతడు తల్లులు—ఆట పాటలు అను పుస్తకమును ప్రచురించెను. తన విద్యా సూత్రములకును పద్ధతులకును తగిన ఉపకరణములను సృష్టించి వాని నాచరణీయముగా జేసెను.

ఫ్రోబెల్ యొక్క స్వయంకృషి, కల్పనాశక్తి :

విద్యను సాధించుటకు స్వయంకృషి కల్పనాశక్తి ముఖ్యమైన మార్గములు. బాలురలో కనిపించు చురుకుదనము రెండు విధములుగా నుండును.

(1) స్వతస్సిద్ధమైనది.

(2) ఉపాధ్యాయుల లేక తలి దండ్రుల ప్రేరేపణవలన నేర్పడునది.

తమ నిశ్చయములకు క్రియారూప మిచ్చుటయే స్వతస్సిద్ధమైన చురుకుదనమనబడును. దీనివలన వ్యక్తిత్వము వృద్ధిపొందును.

స్వకీయమైన ఈ చురుకుదనమునకును కల్పనాశక్తికిని సంబంధము గలదు. వస్తువులరూపమును మార్చి వివిధరకములైన వస్తువులను కల్పించవచ్చును. ఈ కల్పనను ప్రకటించుటకు క్రొత్తభావములు, అభిప్రాయము లవసరము. స్వంతముగా పనులొనర్చుటవలన మానవుని జ్ఞానము వినిన దానికంటెను కనినదానికంటెను నెక్కువ యభివృద్ధిచెందును.

ఫ్రోబెల్ యొక్క బహుమానములు, వృత్తులు :

ఫ్రోబెల్ బాలురలో గోచరించు ఈ స్వతస్సిద్ధమైన చురుకుదనమును, కల్పనాశక్తిని పెంపొందజేయుటకు గట్టి ప్రయత్నముచేసెను. చిత్రలేఖనము, గృహపరిశ్రమలు, తోటపని, ఇండ్లు కట్టుట, కాగితముల కత్తిరింపులు, అల్లుట, మాదిరులు సిద్ధపరుచుట మొదలగువాని వలన బాలుర స్వయంకృషి, కల్పనాశక్తి పెంపొందజేయవచ్చునని ఫ్రోబెల్ తలంచెను. దీనినే కిండర్‌గార్టన్ పద్ధతియందురు. ఈ విధానమువలన బాలుర చురుకుదనము కల్పనాశక్తి క్రియారూపము దాల్చును. ఈకిండర్‌గార్టన్ పద్ధతుల ననుసరించి పరిశోధనలుసలిపి, విమర్శించి, దాని నభివృద్ధిపరచుటలో ఫ్రోబెల్ తన జీవితమంతయు గడపెను.

బాలురకు మూడు విధములైన సహకారపద్ధతుల మూలమున శిక్షణనిచ్చి వారి కల్పనాశక్తి పెంపొందజేసెను. అవియేవన.

(1) గీతము (2) అభినయములేక భావప్రకటన (3) కల్పన. ఈ మూడును వేరు వేరుగా కాన్పించినను వీనికి పరస్పరసంబంధమును ఏకత్వమును గలదు. ఉ. కథ చెప్పబడునప్పుడుగాని వినునప్పుడుగాని బాలురు దానిని గీతముగా బాడుదురు. నాటకములో వలె అభినయము లేక భావప్రకటన జేయుదురు. గీతములోని విషయమునకూ కాగితముతోగాని బంకమట్టితోగాని లేక ఇతర

పదార్థములతోగాని రూపకల్పన చేయుదురు. ఈ రీతిగా బాలురు తమ భావములకు వస్తురూపమునిచ్చి తమ కల్పనాశక్తిని అభిప్రాయములను వృద్ధిపరచుకొందురు. దీనివలన వారి కంటికి, చేతికి, కండరములకు నైపుణ్యమబ్బును. వారి యభిప్రాయములు దృఢపడును.

ఫ్రోబెల్ రచించిన "తల్లి - ఆటగీతము"లను పుస్తకములో తన పద్ధతి నంతయు పూర్తిగా వర్ణించెను. అతని విద్యాసూత్రములన్నియు అందులో వివరించెను. ఆ పుస్తకములో క్రమపద్ధతితో అతని గీతములు ఆటలు బొమ్మలు వివరింపబడెను. పిల్లలకు తగు విద్యాశిక్షణ యివ్వగలందులకు తల్లులకు సమంజసమైన హితవొసంగబడెను.

శైశవమున బాలురకు తల్లులే విద్య ప్రారంభింపవలెను అను భావము కలుగజేయబడెను. ఆటపాటల మూలమున పసిపిల్లల ఇంద్రియములు, అంగములు, కండరములు తగిన శిక్షణ పొందును. ఫ్రోబెల్ వారి కుపయుక్తమగునట్లు 50 ఆటగీతములు సిద్ధపరచెను. ప్రతి గీతమును మూడు భాగములుజేసెను. మొదటి భాగములో తల్లికి దారిచూపుసామెతలుండెను. రెండవభాగములో శిశువులకు పాడుటకు వీలగు గీతముండెను. మూడవభాగములో గీతమురొుక్క భావము చిత్రరువ్రరూపమున చిత్రింపబడియుండెను. ప్రతిగీతము బాలుని శారీరిక, మానసిక, నైతికశక్తులను అభివృద్ధి పరచుటయేగాక సులభమైన వ్యాయామమునకుగూడ అవకాశమిచ్చును. ఫ్రోబెల్ రచించిన గీతముల క్రమము బాలుర మానసికాభివృద్ధికి తగినట్లుండెను.

**కిండర్ గార్టన్ పద్ధతి; బహుమానములు :** ఫ్రోబెల్ కల్పించిన బహుమానములు మఱియు వృత్తులు మిగుల ఆశ్చర్యకరమైనవగుటయేగాక ఫ్రోబెల్ యొక్క స్వతంత్రాభిప్రాయములను గూడ వ్యక్తపరచు చున్నవి.

బహుమానములకును వృత్తులకును ఎక్కువ భేదము కాన్పించదు. వృత్తులు లేక పనులు- బాలురు చేయవలసిన పనులను, బహుమానములు- పనిచేయుటకై వలసిన అభిప్రాయములను వివరించును. క్రమముగా బహుమానములకంటె వృత్తులకే యెక్కువ ప్రాముఖ్యమీయబడినట్లు స్పష్టమగును.

ఫ్రోబెల్ యొక్క క్రమాభివృద్ధి సూత్రము :

ఇది తీర్పు లేక క్రిమములో కాన్పించును. ఒక బహుమానములోని లక్షణములకును రెండవ దాని గుణములకును భేదమున్నను రెండవ బహుమానములో మొదటిదాని లక్షణములుగూడ చేర్చబడియుండుటచే బాలురు రెండవ బహుమానమునుగూర్చి నేర్చుచు మొదటిదాని గుణములను పునశ్చరణ చేయుదురు. అందుచే రెండవ బహుమానమును సులభముగా ఉపయోగింపగలుగుదురు.

బహుమానములు :

(1) ఆరు వివిధరంగులు గలిగిన ఉన్నిబంతుల పెట్టె మొదటి బహుమానము. బాలురు ఆటలాడుచు ఈబంతులను గుండ్రముగా త్రిప్పుదురు. అప్పుడు వారు వాటియొక్క ఆకారము, రంగు, పదార్థము, చలనము, అవిపోవుదిక్కు, వాని మృదుత్వము మొదలగునవి పరిశీలించి గ్రహింతురు.

(2) వర్తులాకారముగల స్థూపము :- ఇదివరకు బాలురు బంతి ఆకారముతో పరిచయమున్నవారు గావున స్థూపములోగల గోళాకారము సులభముగా గ్రహింతురు. గోళములోలేని స్తంభాకారము క్రొత్తగా వారు పరిశీలింతురు. స్థిరముగానుండు స్థూపాకారమునకును, అస్థిరమైన గోళాకారమునకునుగల భేదమును తెలిసికొందురు. స్థూపములో నిమడ్చబడియున్న గోళ స్తంభాకారములు రెంటిని పరిశీలింతురు.

(3) అష్టఘనములుగల కొయ్య ఘనము:- ఇది ఎనిమిది చిన్నఘనములు గలిగిన పెద్ద ఘనముగావున బాలురు చిన్నవగు వివిధ ఘనములకుగల పరస్పర సంబంధము, అవి యన్నియుకలిసి ఒకే వస్తువుగా ఏర్పడుట చూతురు. దానివలన వివిధ భాగములు కలయుటచేత ఒక వస్తువు ఎట్లు చేయబడునో తెలిసికొందురు. దీనిని ప్రమాణముగా తీసికొని పడకకుర్చీలు, బెంచీలు. ద్వార బంధము, సింహాసనము మొదలగునవి నిర్మించు విధానము బాలురు గ్రహించగలుగుదురు.

4 మొదలు 6 వరకు గల మూడు బహుమానములు, మార్చి వివిధ పరిమాణములు ఆకారములుగా చేయబడిన వస్తువులే. వీని మూలమున బాలురు నిర్మాణాత్మకమైన రేఖా గణితము, బీజ గణితము, త్రిభుజశాస్త్రము మొదలగునవి నేర్చు కొందురు. ఈ యారు బహుమానములుగాక కొయ్యచెక్కలు, పుడకలు, ఉంగరములుగూడ బహుమానములలో చేర్చబడి వాటి సంఖ్య తొమ్మిదివరకు పెంచబడెను. చివర నుదాహరించిన వస్తువులు బాలురకు ఉపరిభాగములు, బిందువులు, రేఖలు మొదలగువానితో పరిచయము కలుగజేసి ఇదివరకు వారికి పరిచయమైన ఘనవస్తువులకును వీనికినిగల భేదమును తెలియపరచును. ఇంతేగాక బహుమానములవల్ల చతురము, కైవారము, ఘనము నకుగల పోలికలు భేదములు తెలిసివచ్చును. ఈ జ్ఞానమువలన బాలురు వస్తువులను మనోహరముగా సిద్ధపరచుటకు వలయు జ్ఞానము, కల్పనాశక్తి గలవారగుదురు.

బహుమానముల మూలముగ సంగ్రహింపృత్తులు : చిన జ్ఞానమును వృత్తులకు వర్ణింపజేయబడును.

కాగితము, ఇసుక, బంకమన్ను, కొయ్య, తదితర పదార్థములతో చేయబడువస్తువులను వృత్తులందురు. ఈ వస్తువులను చేయుటకై నైపుణ్యము, స్వయంకృషి అవసరము. బాలు

రకు బహుమానములతో పరిచయమగువరకు వృత్తులను ప్రారంభింపరాదు. ఏలనన భావములు లేనిచో వస్తుకల్పన సాధ్యము కాదు. ఘనరూపములగు బహుమానములను చర్చించు సందర్భములో శాలురతో మట్టిబొమ్మలు చేయించుట, అట్టతో కత్తిరింపులు, కాగితపు మడతలు, కొయ్యపైన నగిషి మొదలగు విషయములను చర్చించుట సమంజసము. ఉపరిభాగముల వర్ణించు బహుమానముల చర్చతోపాటు కాగితపు అల్లిక, కుట్టుపని, చిత్తరువులు గీయుట మొదలగువాని విషయమైచర్చ లాభదాయకము.

**విద్యనుగూర్చి ఫ్రోబెల్ అభిప్రాయములు:** ఫ్రోబెల్ కాలమునాటి పరిస్థితులు, మతసంబంధమైన వాతావరణములో పెరుగుట, సృష్టితో పరిచయము, ఆకాలపు వేదాంతుల అభిప్రాయములు మొదలగునవి అతని అభిప్రాయములలో గొప్పమార్పు కలుగజేసెను. ఆకాలపు తత్వశాస్త్రజ్ఞులు, మానవులు, సృష్టి, భగవంతునియొక్క నిర్మాణమనియు, భిన్నభిన్నముగ కనబడినను సృష్టిలో ఐక్యము గలదని తలంచుచుండిరి. ఫ్రోబెల్ వీరి యభిప్రాయములతో ఏకీభవించెను. ప్రపంచమంతయు భగవంతుని నిర్మాణమనియు ఆయన శాసనములకు బద్ధమనియు, ఆయన మహిమచేతనే వర్తిల్లుచున్నదనియు ఫ్రోబెల్ తాను రచించిన "మానవవిద్య" అను పుస్తకములో వివరించెను. సృష్టిలో నైక్యమున్నట్లే విద్యావిషయములలోగూడ ఏకత్వముండవలెనని తలంచెను. భగవంతుని శాసనముల గుర్తెరిగి విధేయులైయుండుటయే విద్యయొక్క పరమోద్దేశమని యభిప్రాయపడెను. ప్రతివస్తువులోను ప్రతి జీవిలోను ఈశ్వరాంశ యున్నదనియు అదియే మానవాభివృద్ధికి కారకమనియూ తలంచెను.

**ఐక్యము, క్రమాభివృద్ధి:** సృష్టిలోను మానవ జీవితములోను ఐక్యము క్రమము అభివృద్ధి కలవు. ఇట్టి యభివృద్ధిని గుర్తించిన జ్ఞానము నెల్లరు నార్జింపవలెను. ఈ క్రమాభివృద్ధిని మరుగుపరుచు విభజన యెంత

మాత్రము పనికిరాదు. మానవుని జీవితములో వేరు వేరు దశలు అనగా శైశవము, బాల్యము, యౌవనము, కౌమారాద్యవస్థలకు పరస్పర సంబంధమున్నది. ప్రపంచములో మానవ జీవితదశలలో ఐక్యమున్నట్లే మానవుని మానసిక, శారీరిక, నైతిక విషయములలోగూడ నైక్యము గలదని ఫ్రోబెల్ భావించెను.

**విద్యావిషయములలో ఐక్యము :** విద్యా విషయములలోను ప్రణాళికలో గూడ ఏకత్వము గలదని ఫ్రోబెల్ భావించెను. కాని హెర్బార్టువలె దానికి పరస్పర సంబంధమని నామకరణం చేయలేదు. మానవుడు విద్యమూలమున సృష్టిని, మతమును, భాషలను గురించి జ్ఞానము సంపాదించవలెను. ఈ మూడింటికినిగల ఐక్యము గ్రహించనియెడల విద్య వృధాయగును. సృష్టిపరిశీలనవలనను, విద్యవలనను భగవంతుని కర్తృత్వమును తెలిసికొని సృష్టి అతని స్వరూపమనియు, ప్రపంచమంతయు క్రమశాసనబద్ధమనియు మనము గ్రహింతుము. జ్ఞానమును ఒక వృక్షముతో పోల్చవచ్చును. ఏ విధముగా చెట్టునకును కొమ్మలకును సంబంధముండునో అదేరీతిగా పాఠశాలకును ఇంటి పరిస్థితులకును సంబంధ ముండవలెను. బాలురకు విషయమును బోధించి వారిచే వల్లెవేయించుట తగని పని. బాలురకు శిక్షణ యిచ్చుటకై ఇల్లు పాఠశాల కలిసి కృషి చేయవలెను. ఇంటిలోను బడిలోను ఉపయుక్తమగు పనుల ద్వారా బాలురకు విద్యనేర్పవలెను.

**ఫ్రోబెల్ విద్యాసూత్రముల విలువ :** ఫ్రోబెల్ పెస్టాలోజీయొక్క నిజమైన శిష్యుడు. పెస్టాలోజీవలె నితడు మానవుని సహజవికాసమునకు ప్రాముఖ్యమిచ్చెను, కాని పెస్టాలోజి దాని నేవిధముగ నభివృద్ధిపరచవలెనో తెలుపలేదు. ఫ్రోబెల్ యొక్క యభిప్రాయములు పెస్టాలోజీ యభి

ప్రాయములకంటె తేటతెల్లమైనవి. కొంతవరకు మానవుని సహజ వికాసములను పెంపొందజేయుటకు అవసరమగు పద్ధతులను శిక్షణలను కల్పించి ఆతడు ఆచరణలో పెట్టెను. పెస్టాలొజీ విద్యా సంస్కరణకై చాల పాటుపడి, యనువగుమార్గములను చూపెను. ఫ్రోబెల్ తన యనుభవపరిశీలనల ఫలితముగా కొన్ని సూత్రముల నిర్మించి వాటికి క్రియారూపమిచ్చి విద్యాపద్ధతులకు ప్రోత్సాహమిచ్చెను. పరిశీలన మూలమున జ్ఞానార్జనము చేయవలెనని పెస్టాలొజీ తలంచెను. పెస్టాలొజీ పద్ధతులను ఫ్రోబెల్ అభివృద్ధి పరచెను. క్రీ. శ. 1900 లో విద్యాతత్వము, శాస్త్రజ్ఞానమును విద్యాభివృద్ధికై వర్తింపజేసిన మహావేత్త ఫ్రోబెల్ అని భావింపవచ్చును. ఫ్రోబెల్ ప్రారంభదశలోని విద్యావిషయమై మాత్రము జోక్యము కలుగజేసికొనెను కాని యితని సూత్రము లితరదశలకు గూడ అమూల్యమైన సలహాలిచ్చెను.

# హెర్బార్టు

## క్రీ. శ. 1776 — 1841

హెర్బార్ట్ తండ్రి న్యాయవాది. తల్లి అసమానమైన తెలివితేటలు కలిగిన స్త్రీ. కావున ఆమె తన కుమారుని విద్యాభ్యాసమును తెలివితేటలతో నడుపగలిగెను. హెర్బార్ట్ తాత

బాల్యము, విద్యాభ్యాసము:

ఒక పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడు. కాబట్టి హెర్బార్ట్‌కు పుట్టుక చేతను, విద్యాభ్యాసము చేతను అత్యుత్తమమైన మానసిక పరిస్థితులు, విద్యాపారంగతుడగుటకు తగిన ఆనుకూల్యము నేర్పడెను. అతని తల్లి గ్రీకుభాషను గణితమును బోధించెను. పాఠశాలలో నుండగనే హెర్బార్ట్ పెక్కువిధములైన శక్తిసామర్థ్యములను గనపరచెను. చిన్నతనమునందే వేదాంతమును గురించియు, నైతిక స్వాతంత్ర్యమును గురించియు వ్యాసములు వ్రాసి కీర్తిగడించెను. జీనా విశ్వవిద్యాలయములో బి. ఎ. డిగ్రి సంపాదించుటకు పూర్వమే దానిని వదలి స్విడ్జర్‌లాండ్‌లోని ఒక రాష్ట్రాధిపతి కుమారులకు బోధకుడుగా నియమితుడయ్యెను. క్రీ. శ. 1797 మొదలు 1799 వరకు బోధకుడుగా నుండి బోధనాశాస్త్రమును గురించి మంచి అనుభవమును గడించెను. రాష్ట్రాధిపతి కోరికపై తాను అనుసరించిన బోధనాపద్ధతులను బాలుర యొక్క అభివృద్ధిని పక్షమునకొకసారి ఉత్తరముల మూలమున హెర్బార్ట్ తెలుపుచుండెను. ఆ వృత్తాంతమంతయు చదివినచో అతని అభిప్రాయములు స్పష్టపడగలవు. హెర్బార్ట్ విద్యకు

శిక్షణాపద్ధతులను బాలుర మానసికతత్వమును ఆధారముగా గొన్నట్లు తోచును. బాలుర మానసిక పరిస్థితులను గమనించి ప్రణాళికలోని విషయములను నైతికధర్మమును బోధించెను.

**హెర్బార్ట్, పెస్టాలొజి :** పెస్టాలొజి స్విడ్జర్లాండ్‌లోని "బర్గ్‌డాఫ్" అనుచోట ప్రయోగపాఠశాల నొకటి స్థాపించి ప్రయోగములు సలుపుచుండెను. హెర్బార్ట్ ఆ పాఠశాలను సందర్శించెను. పెస్టాలోజి అభిప్రాయములను, సూత్రములను స్పష్టపరుచుటకై తీర్మానించు కొనెను. పెస్టాలొజీ పరిశీలనాపద్ధతిని యితర బోధనాపద్ధతులను అభివృద్ధిపరుపదలచెను. ఈ సందర్భమున అతను పెస్టాలొజి రచించిన 'ప్రారంభ పరిశీలనము" (A. B. C. of observation), "గర్‌ట్రూడ్ తన పిల్లలకు బోధించినవిధము" అను రెండు పుస్తకములను విమర్శించెను. హెర్బార్ట్, పెస్టాలొజి ప్రయోగములను పద్ధతులను ఆమోదించెను. వాటిలోని లోపములను సరిచేయ నిశ్చయించెను.

హెర్బార్ట్ "ఘాటింజను" విశ్వవిద్యాలయములో 7 సంవత్సరములవరకు బోధనాశాస్త్రాధ్యాపకుడుగా నుండెను. హెర్బార్ట్ పెస్టాలొజి బోధనాపద్ధతిని గురించి "విమర్శన", "నైతిక ధర్మమును గుర్తింపజేయుటయే విద్యయొక్క ముఖ్యోద్దేశము" అను రెండు పుస్తకములను వ్రాసెను. ఈ రెండు పుస్తకముల లోను విద్యార్థులకు నైతిక శిక్షణఇచ్చుటయే విద్యకు బరమప్రయోజనమని అతడు ఉద్ఘాటించెను. ఇంద్రియములద్వారా జ్ఞానార్జన అవసరమను పెస్టాలొజి అభిప్రాయముతో ఇతడు ఏకీభవించెను. కాని విద్యాప్రణాళిక నిర్ణయము విద్యయందలి నైతికోద్దేశ్యమును అనుసరించియే యుండవలెననియు, విద్య స్వీయ నైతిక వికాసమునకు తోడ్పడునట్లుండవలెననియు అతడు తలంచెను. అతడు వ్రాసిన

బోధనాశాస్త్రములో ఈ అభిప్రాయమును మరింత స్పష్టపరచెను.

కోనిస్‌బర్గులో పాఠశాల, అభ్యాసశిక్షణాశాల

క్రీ. శ. 1809 లో కోనిస్‌బర్గ్ విద్యాలయములో హెర్బార్ట్ వేదాంత అధ్యాపకుడుగా నియమింపబడెను. ఇచ్చట ఉండగా ఆయన విద్యాసూత్రములను గురించి, విద్య అభ్యాసమునుగురించి చాల పరిశోధనచేసెను. కోనిస్‌బర్గులో ఒక పాఠశాలను, దానికి అంగముగా అభ్యాసశిక్షణా పాఠశాలనుగూడ స్థాపించెను. ఈ విధముగా అతడు విద్యనుగురించి శాస్త్రీయపద్ధతులపై ప్రయోగములను పరిశోధనలను ప్రారంభించి ఇతరులకు మార్గదర్శి అయ్యెను. అభ్యాసశిక్షణా పాఠశాలలో విద్యార్థులు ఉపాధ్యాయుల సన్నిధిలో విద్యనేర్చుచు విమర్శనలకు పాత్రులగుచుండిరి. ఇక్కడ ఉండగా హెర్బార్ట్ మానసిక తత్వశాస్త్రమును గురించి పెక్కు గ్రంథములను, విద్యావిషయమై పెక్కు వ్యాసములను వ్రాసెను. 25 ఏండ్లు ఇక్కడ పనిచేసి, తిరిగి "గూటింజన్" విద్యాలయములో ప్రధాన అధ్యాపకుడై 8 సంవత్సరములు పని చేసెను. క్రీ. శ. 1835 లో బోధనాశాస్త్రముపై క్లుప్తముగ ఉపన్యాసములను రచించెను. చివర రచించిన గ్రంథములో విద్యాబోధనాపద్ధతిని గురించియు, విద్యకును మానసికతత్వమునకును గల సంబంధమును గురించియు విపులముగా వ్రాసెను.

హెర్బార్ట్ యొక్క స్వోపలబ్ధి సూత్రము

విద్యావిధానమును మానసిక శాస్త్రముపై ఆధారముచేసి తగిన శాస్త్రపరిశోధనలు చేసినవారిలో హెర్బార్ట్ అగ్రగణ్యుడు. అతడు ఆత్మపరీక్షవలన మానసిక ధర్మములను కనుగొనగలిగెను. సాధారణముగా వ్యక్తి బాహ్యప్రపంచమునుచూచి అభిప్రాయములను తెలిసికొనును. ఒకమారు ఏర్పడిన అభిప్రాయములో మార్పు కలుగక అవి తమ వ్యక్తిత్వమును కాపాడుకొనును. ఇట్టి అభిప్రాయములు స్మృతిలో నిలిచిపోయి తమకు

సంబంధించిన అభిప్రాయములను తమ వైపునకు లాగుకొని పుష్టి చెందును. పిమ్మట నవి స్థిరముగ నిలిచిపోవును. వానికి వ్యతిరేకములగు అభిప్రాయములుకూడ స్మృతిలో ప్రవేశించును. కాని పైన ఉదాహరించిన అభిప్రాయములతో ఏకీభవించక వేరుగ నిలచిపోవును. పరస్పర సంబంధముగల అభిప్రాయములకు, వ్యతిరేకాభిప్రాయములకును నిరంతరము వైరముండును. ఒకదాని నొకటి స్మృతినుండి పారద్రోలుటకై యత్నించుచుండును. స్మృతిలోనుండు అభిప్రాయములతో సంబంధముగల అభిప్రాయములు చేరి మిళితమై వానిలో మార్పు కలుగజేయును. స్మృతిలోని అభిప్రాయములు సాజాత్యములగు క్రొత్త అభిప్రాయముల మాత్రమే స్వీకరించును. ఇదియే హెర్బార్ట్ యొక్క స్వోపలబ్ధిసూత్రము. పూర్వజ్ఞానముతో క్రొత్త అభిప్రాయముల కలయిక వలననే స్వోపలబ్ధి కలుగును. ఈ స్వోపలబ్ధిసూత్రముపై హెర్బార్ట్ తన బోధనాపద్ధతిని నిర్మించెను. దీని ననుసరించి ఉపాధ్యాయుడు బాలురయొక్క శ్రద్ధను, అభిరుచిని క్రొత్త అభిప్రాయములవైపునకు త్రిప్పి పరస్పర సంబంధములను కలుగజేసి జ్ఞప్తియందుంచుకొనునట్లు చేయగలుగును. క్రొత్త అభిప్రాయములను ఏవిధముగ ప్రదర్శించిన పూర్వజ్ఞానముతో ఐక్యము గలుగునో గ్రహించుటయే బోధనాపద్ధతిలోని ముఖ్యసమస్య. ఉపాధ్యాయుడు స్వోపలబ్ధి పరంపరలచేత బాలుర మానసిక స్థితిని పెంపొందజేయగలడు. కావుననే బాలుర మనోవృద్ధియంతయు ఉపాధ్యాయుని చేతిలో నున్నదనుట అతిశయోక్తి కాజాలదు.

**వివిధ విషయ జ్ఞానము :** మానవుని నైతిక ధార్మికాభివృద్ధి విద్యాభ్యాసమువలన కలుగును. విద్యాభ్యాసము బాలుర మానసిక పరిస్థితులమీద ఆధారపడి యుండును. ఉపాధ్యాయుడు బాలుర మానసిక శక్తి సామర్థ్యములు గుర్తెరిగి వాటిని ఏవిధముగా వినియోగించిన

బాలురకు నైతికాభివృద్ధి కలుగునో గమనించవలయును. ప్రణాళికలోని విషయములు శీలమును అభివృద్ధిపరచి స్వభావములో మార్పు గలిగించవలెను. బోధించు క్రొత్త విషయములు పూర్వజ్ఞానమునకు సంబంధించునవిగా నుండవలెను. అవి జీవితమునకును ప్రవర్తనకును పరస్పర సంబంధమును కలుగచేయునవిగా నుండవలయును. బాలుర మానసిక వికాసమును వృద్ధిపరచుటకును క్రొత్తభావములు, అభిరుచులు కలుగజేయుటకును ప్రణాళికలో పెక్కు విషయములు చేర్చవలయును. దీనివలన బాలురు వివిధ విషయములను గురించి జ్ఞానము సంపాదించుదురు. కావున పెక్కు విషయములను ప్రణాళికలో చేర్చుట లాభదాయకము.

నైతిక జీవితమును పెంపొందజేయుట విద్యకు ముఖ్య ప్రయోజనమైనట్లే, బాలురకు వివిధ విషయములను గురించి జ్ఞానము కలుగజేయుటయే బోధనలకు ముఖ్యోద్దేశ్యము. బోధనచే నూత్నభావములు, వానివలన సచ్ఛీలము లభించును.

ప్రణాళికలో చేర్చవలసిన విషయములను హెర్బార్టు రెండు భాగములు జేసెను. (1) చరిత్ర (2) శాస్త్రము. ఈ రెండును బాలుర విషయజ్ఞానమునకు తోడ్పడును. వివిధ విషయములను బోధించునపుడు వాటికి గల పరస్పర సంబంధమును ఐక్యమును బాలురకు సమయానుకూలముగా తెలుపవలెను.

**హెర్బార్ట్ సోపానములు:** ఇదివరలో మనము వివిధ విషయములను గురించి బాలురకు జ్ఞానము కలుగజేయుట అవశ్యమని తెలిసికొనియుంటిమి. ఉపయుక్తమగు బోధనాపద్ధతిని అనుసరించుట వలనను ప్రణాళికలో చేర్చిన అంశముల వలనను లాభము కలుగునని హెర్బార్ట్ తలంచెను. బోధింపబడు విషయములు క్రమముగను, పద్ధతియుక్తముగను ఉండవలెను. బోధనాపద్ధతి బాలుర మానసిక

దశలకు తగినట్లుండవలెను. జ్ఞానము దృఢపడుటలో రెండు మానసిక పరిణామములు కలుగుచుండును. (1) విషయమును గ్రహించుట (2) విషయముల ఐక్యము లేక సమ్మేళనము. బాలురు బోధింపబడు విషయములను గ్రహించుచు వాటినిగూర్చి మననము చేయుచుందురు. గ్రహించిన విషయములను తర్వాత జీర్ణము చేసికొనుచుందురు. ఈ రెండు మానసిక దశలను హెర్బార్ట్ గుర్తునందుంచుకొని తన బోధనాపద్ధతిని నిర్మాణము చేసెను. తన పద్ధతిని అతడు నాలుగు మెట్లుగా లేక సోపానములుగా విభజించెను. (1) స్పష్టత లేక విషయ ప్రదర్శనము (2) సమ్మేళనము అనగా క్రొత్త విషయమునకును పూర్వజ్ఞానమునకు సంధానము లేక సంబంధము కలుగజేయుట (3) క్రమము అనగా ఐక్యము చెందిన జ్ఞానమును తర్కయుక్తముగ పొందింపజేయుట. దీనినే సూత్రీకరణ మనవచ్చును. (4) ప్రయోగము అనగా గ్రహించిన జ్ఞానమును క్రొత్త విషయములకు వర్తింపజేయుట.

హెర్బార్ట్ బోధనాపద్ధతిని అతని అనుచరులు మిగుల విపులపరచిరి. అతని శిష్యుడగు "జిల్లర్" స్పష్టత అను మెట్టును ప్రారంభము, ప్రదర్శనము అను రెండు సోపానములుగా విభజించెను. మరియొక శిష్యుడగు "రేన్" ప్రదర్శనమునకు ముందు ఉద్దేశ్యము అను సోపానమును నిర్మించెను. ఇతర అనుచరులు హెర్బార్ట్ సోపానములలో మరికొన్ని మార్పులు కలుగజేసి వాటిని ఐదు మెట్లుగా విభజించిరి. అవేవన (1) ప్రారంభము (2) ప్రదర్శనము (3) సంధానము (4) సూత్రీకరణము (5) ప్రయోగము లేక అభ్యాసము.

**అదుపు, ఆజ్ఞలు; క్రమశిక్షణ :**

హెర్బార్ట్ బాలురను అదుపాజ్ఞలలో ఉంచుటకును, క్రమశిక్షణకును భేదమున్నదని తలంచెను. విద్యార్థులను ఆజ్ఞాబద్ధులుగా చేయుటకు కఠిన చర్యలు అవసరమనెను. వారు ఆజ్ఞా

వర్తనులు కానిచో వారికి నైతిక శిక్షణ అబ్బుట కష్టమని తలంచెను. బాలురను విధేయులుగా చేయుటకై వారిని పనిలో నిమగ్నులగునట్లు చేయుటకు తగిన ఆజ్ఞలు, బహుమతులు, శిక్షలు, నిషేధములు ఏర్పాటు చేయవలయును. కాని కేవలము బాలురను అదుపులోనుంచుట నష్టదాయకము. దానితోపాటు వారికి నైతిక శిక్షణకూడ కలుగజేయవలెను. ఈ శిక్షణకు ఇంద్రియ నిగ్రహమే ఫలము. ఉపాధ్యాయుని వాత్సల్యము, అనురాగము నైతిక శిక్షణకు తోడుపడును. క్రమశిక్షణ వలన బాలురకు బుద్ధిపూర్వకమగు సహకారము అలవడును. ఇట్టి ప్రయోజనకరమగు నైతిక శిక్షణ పాఠశాలకు ముఖ్యోద్దేశ్యముగా పరిగణింపవలయును.

**హెర్బర్ట్ యొక్క విద్యాసూత్రముల విలువ :** పెస్టాలొజి విధానముకంటె హెర్బార్ట్ పద్ధతి యెక్కువ హేతుబద్ధముగ, విశాలముగనుండెను. పెస్టాలొజి దయగలవాడు, సంఘసంస్కరణాభిలాషి; హెర్బార్ట్ మానసిక తత్వవేత్త, వేదాంతి. పెస్టాలొజీ ప్రజలందరికిని విద్య అవసరమనియు ఆ కాలపు పాఠశాలలో ఆచరణలోనున్న సాంప్రదాయములలో మార్పు రావలెననియు తలంచెను కాని తన అభిప్రాయములను ఆచరణలోనికి తేలేకపోయెను. విద్యాబోధన బాలుర మానసిక స్థితికి తగినట్లుండవలెననియు స్పష్టమైన అభిప్రాయములు ఇంద్రియ ద్వారమున పరిశీలించుటచేత ఏర్పడుననియు భావించుచుండెను. ఆ కాలమున ఉన్న మానసిక తత్వములో ఎట్టిమార్పులు గలుగజేయలేకపోయెను. పరిశీలన వలన గలుగు జ్ఞానము జీర్ణము చేసుకొనుటకు తగుపద్ధతిని చూపలేకపోయెను.

హెర్బార్ట్ పెస్టాలొజివలె కాక విద్యకు తగిన మానసిక సూత్రములను నిర్మించెను. పరిశీలనవలన కలుగు జ్ఞానము స్వోప

లబ్ధిమూలమున ఎట్లు దృఢపడునో నిరూపించెను. పద్ధతి ప్రకారము నేర్పిన విద్య ఏవిధముగా నైతికాభివృద్ధికి తోడ్పడునో చూపెను. తగు పద్ధతులను అవలంబించుటవలన బోధనాపద్ధతులు నీతిని ఎట్లు పెంపొందజేయునో స్పష్టపరిచెను. బోధనను సులభము చేయుటకై సోపానములను కల్పించెను. బోధనలో క్రమపద్ధతికి చాల ప్రాముఖ్యమిచ్చెను. ఉపాధ్యాయునికిని బోధనాపద్ధతికిని హెర్బార్ట్ ఇచ్చిన ప్రాధాన్యము మరెవ్వరును యివ్వలేదు.

# హెర్బర్ట్ స్పెన్సర్



## క్రీ. శ. 1820 — 1903

బాల్యము, విద్యాభ్యాసము :

ఇతడు క్రీ. శ. 1820 లో ఇంగ్లాండు నందలి డర్బీ అను పట్టణమందు జన్మించెను. విద్యావత్తగల కుటుంబములో జన్మించుటచే ఇతడు మంచి విద్యావాతావరణములో పెరిగెను. ఇతని తండ్రియు, పినతండ్రియు ఇతని విద్యాభ్యాసమును గురించి కడు శ్రద్ధవహించిరి. మొదటినుండి స్పెన్సర్‌కు పురాతన గ్రంథ పఠనమందు అయిష్టముండెను. శాస్త్రపఠనమందు మంచి అభిరుచి, ఆసక్తియుండెను. తండ్రి కుమారుని అభీష్టమును గుర్తెరిగి అతనికి ఏది రుచికరమో దానినే అభ్యసించుటకు అనుమతి నిచ్చెను. స్పెన్సర్ సృష్టివిద్యయందు, పరిశీలనమునందు నిమగ్నుడైయుండెను.

ఉద్యోగ సంపాదనకై వృత్తి విద్య నేర్చుకొనవలసివచ్చెను. అతడు ఇంజనీయరు విద్య నభ్యసించి సుమారు ఎనిమిది సంవత్సరముల వరకు రైల్వే ఇంజనీయరుగా పనిచేసెను. క్రీ. శ. 1845 లో అతడు ఉద్యోగమును వదలి ప్రియతరమగు వేదాంతము మరియు వాఙ్మయము వైపు తన బుద్ధిని మరల్చెను. క్రీ. శ. 1845 నుండి క్రీ. శ. 1853 వరకు అతడు ఒక ఆర్థిక మాసపత్రికకు సహాయ సంపాదకుడుగా నుండి పెక్కు వ్యాసములను రచించెను. వాఙ్మయమందు మంచి అభిరుచి గలవాడగుటచేత అతని వ్యాసములు జనాదరణము పొందెను.

ఆ కాలమునం దతడు గొప్ప వేదాంతిగను గ్రంథకర్తగను పరిగణింపబడెను. ఇంగ్లీషు భాషాజ్ఞానము పరిపూర్ణముగా ఉండుటచేత అతడు సులువుగా వ్యాసములను రచింపగలుగుటయేగాక పదములను క్రొత్త క్రొత్త విధముల ఉపయోగించెను. ఇతని వ్యాసరచనా ధోరణియు, విషయములు అసమానముగా ఉండెను. క్రీ. శ. 1855 లో స్పెన్సర్ మానసిక తత్వసూత్రము లను గ్రంథమును పది సంపుటములలో ప్రచురించెను. పై నుదాహరించిన అమూల్యగ్రంథమునేగాక శాస్త్రము వేదాంతము లోకజ్ఞానమునకు సంబంధించిన పెక్కు గ్రంథములను అతడు రచించెను. వీటి అన్నిటిలో "విద్యాతత్త్వము" అను గ్రంథము మిక్కిలి ప్రసిద్ధిగాంచి 17 భాషలలో భాషాంతరీకరింపబడెను. ఈ గ్రంథములో మిక్కిలి నవీనాభిప్రాయములను స్పెన్సర్ ప్రచురించెను. అతని అభిప్రాయముల ఫలితములను విద్యావేత్తలందరు గ్రహించి ప్రకృతి శాస్త్రజ్ఞానావసరములను తెలిసికొని నేటి విద్యాప్రణాళికలో శాస్త్రములకు ఉచితమైన స్థానమిచ్చిరి. అతడు రచించిన ఇతర గ్రంథముల నటుంచి "విద్యాతత్త్వము" అను గ్రంథవిషయమై వివరములు తెలిసి కొనుట యుక్తము. ఈ గ్రంథమువలన స్పెన్సర్ గొప్ప విద్యాధురీణుడుగా పరిగణింపబడుటకు కారణము స్పష్టమగును.

**విద్యాతత్త్వము** ఈ గ్రంథము క్లుప్తముగా రచింపబడి అమూల్య భావములు కలిగియున్నది. దీని శైలి, అభిప్రాయముల స్వచ్ఛత, తర్కవాదము చదువరుల మనస్సును ఆకర్షించి వారల వశపరచుకొనును. ఈ పుస్తకము నాలుగు అధ్యాయములుగలది.

మొదటిది విషయముల ప్రాముఖ్యము, క్రమమును గురించియు, రెండవది మానసిక వికాసమును గురించియు, మూడ

వది నైతికాభివృద్ధిని గురించియు, నాల్గవది శరీరమును గురించియు వర్ణించును.

మొదటి అధ్యాయ ప్రారంభమున స్పెన్సర్ జనులు బాహ్యవేషమునకు ప్రాముఖ్యమిచ్చి ప్రధానవిషయములను ఎటుల త్రోసిపుచ్చెదరో వివరించెను. దీనికి ఉదాహరణముగా దుస్తులను పేర్కొని మానవులు వాటిని అందముకొరకై ధరించెదరు గాని, నిజమైన శరీరసౌఖ్యముకొరకు కాదని నిరూపించెను. అదే విధముగా మనుజులు విద్యావిషయమైకూడా నడుచుకొను చున్నారు. నిజముగా జీవితమును సౌఖ్యప్రదముగాజేయు విషయములను విద్యాప్రణాళికయందు చేర్చక బాహ్యమూల్యము గలిగి నట్టివియు, జీవితమునకు ఎవ్విధమునను ప్రయోజనకారులు కానట్టి వియు విషయములకు ప్రాముఖ్య మివ్వబడుచున్నది. ఉ. గ్రీకు, లాటిన్, హీబ్రూ భాషలు నిష్ప్రయోజనమైన ప్రణాళికలో చేర్చుటవలనను, ఉపయోగకరములగు విషయములను బాలురకు బోధించకపోవుటచేతను ఆకాలపు నిరంకుశత్వము వెల్లడిఅయ్యెను.

పై విధమున, "స్పెన్సర్, తన అభిప్రాయములను వెలి బుచ్చిన తర్వాత విషయముల ప్రాముఖ్యము మరియు క్రమమును గురించి వివరించెను. అతని కాలములో పై విషయములను గురించి ఆలోచనచేసిరే ఎరుగరు. ప్రపంచములో నేర్చుకొన దగిన విషయము లెన్నియోగలవు. కాని వాటి నన్నిటిని కొలది జీవితముగల మానవులు నేర్చుకొనజాలరు. కాబట్టి నేర్చుకొన దగిన విషయనిర్ణయము లత్యవసరము. ఏ విషయములు జీవితమున కవసరమో వానినే బాలురకు నేర్పవలయునని "స్పెన్సర్" అభి ప్రాయపడెను. అతడు అవసరమైన విషయములను, వాటి ప్రాము ఖ్యమునుబట్టి అయిదు భాగములుగా విభజించెను. 1 ప్రత్యక్ష ఆత్మరక్షణ, 2 అప్రత్యక్ష ఆత్మరక్షణ, 3 సంతతిపోషణ, 4 సంఘ

విధులు, 5 వినోదములు. పైన వివరించిన పనులను నిర్వర్తించుటకు సాహాయ్యమగు అంశములనే ప్రణాళికలో చేర్చవలెను.

1. ప్రత్యక్షాత్మ రక్షణ : ఇది కొంతవరకు ప్రకృతివైపునుండియు కొంత వరకు మానవ ప్రయత్నము ద్వారాను జరుగుచుండును. దెబ్బల నెదుర్కొనుట, అగ్ని ప్రమాదమునుండి రక్షణ మొదలైనవాటినుండి శరీరమును కాపాడుకొనుటకు ప్రకృతివైపునుండియే ఏర్పాటు చేయబడును. మానవుడు ప్రత్యక్షాత్మరక్షణకై ఆరోగ్యశాస్త్రము నేర్చుకొనుట అవసరము. కాన అట్టి శాస్త్రము ప్రణాళికలో చేర్చవలెను.

2. అప్రత్యక్షాత్మ రక్షణ : జీవనోపాధికి వలయు జ్ఞానము అప్రత్యక్షాత్మ రక్షణలో చేరినది. జీవనోపాధికై చదువుట, వ్రాయుట, గణితము నేర్చుకొనుటయేగాక వృత్తి లేక పారిశ్రామిక విద్య అవసరమని స్పెన్సర్ అభిప్రాయము. ఉ. ఇంజనీయరింగ్ వాస్తుశిల్పము, వడ్రంగము మొదలగునవి. వృత్తివిద్యలకును, విజ్ఞానశాస్త్రమునకును సంబంధము కలదు. మానవునికి విజ్ఞానశాస్త్రసూత్రములను నేర్పనిచో పై విద్యలందుండు నిపుణతను సంపాదించలేడు. ఇదిగాక పరిశ్రమల కృషికై రసాయనశాస్త్రము, భౌతికశాస్త్రము, క్షేత్రగణిత జ్ఞానము మిక్కిలి ఆవశ్యకము. ఈ శాస్త్రములన్నియు విజ్ఞానశాస్త్రములో నిమిడియున్నవి. కావున జీవితసౌఖ్యమునకు అప్రత్యక్షాత్మరక్షణకు విజ్ఞానశాస్త్ర పరిచయము ఆవశ్యకము. గాన ప్రణాళికలో చేర్చవలెను.

8. సంతానరక్షణ : సంతతియొక్క రక్షణ, శిక్షణ, పోషణ విషయమై మానవుడు శ్రద్ధవహించవలయును. అశ్రద్ధవలన తల్లిదండ్రులు మరియు కుటుంబమునకేగాక మానవజాతి కంతటికి అపకారము జరుగుచున్నది.

తల్లి దండ్రుల అజాగ్రత్తవలన జాతియంతయు కష్టములలోను దుఃఖములలోను మునిగియుండుట సంభవించుచున్నది. బాహ్య విషయములను బోధించుటకై కాలయాపన చేయనియెడల ప్రాణ, ధన, మాన హాని జాతికి సంభవింపకుండెడిది. బాలుర మానసిక, నైతిక, శారీరక రక్షణము, పోషణము. మానసిక తత్వ శాస్త్రము, శారీరక శాస్త్రము చదివిన తల్లిదండ్రులు మాత్రమే చేయగలరు. కాబట్టి మానసిక నైతిక శిక్షణకై మానసిక శాస్త్రజ్ఞానము, శరీరరక్షణకై ఆరోగ్యశాస్త్రజ్ఞానము మిక్కిలి ముఖ్యము.

4. సంఘవిధులు : వీటిని నిర్వర్తించుట జీవితముయొక్క నాల్గవ ఆశయము లేక విధి. చరిత్రపఠనము దీనికి మిగుల సహకారి. సాధారణముగా బోధింపబడు చరిత్ర సంఘవిధులను నిర్వర్తించుటకు తోడ్పడదు. సాధారణముగా చరిత్ర జాతీయజీవనమునుగాని లేక దేశాభివృద్ధినిగాని వర్ణింపక, రాజులయొక్క జీవితచరిత్రను, వారుచేసిన యుద్ధములను, సంధులను మాత్రమువివరించును. కాబట్టి ఇట్టి చరిత్రబోధన నిష్ప్రయోజనము. ఈ కారణమునుబట్టియే స్పెన్సర్, చరిత్రలో జాతీయలక్షణములు, వారి ఆచార వ్యవహారములు వారి ఆర్థిక పరిస్థితులు వర్ణింపవలె ననియు, ఆ వర్ణనవలన ప్రజలు ఇతర ప్రాంతముల నుండెడివారి జీవితములతో పోల్చిచూచుకొని అభివృద్ధినొందుటకు వీలగుననియు, తలచెను. దీనికై చరిత్రకారులు మానవుల జీవితమును, దాని సూత్రములను గుర్తెరిగి యుండవలెను. మానవజీవిత సూత్రములకును, విజ్ఞానశాస్త్రమునకును దగ్గరసంబంధముకలదు. కావున విజ్ఞానశాస్త్రజ్ఞానము చరిత్రకు తాళపుచెవి వంటిది.

5. విరామ వ్యాపారములు : విరామమును లాభదాయకముగా గడపుటకై సంగీతము, చిత్రలేఖనము, కవిత్వము మంచి వ్యాపారములు. మొదటి రెండు కళలకు లేక వ్యాపారములకు విజ్ఞానశాస్త్ర మవసరము.

కవికికూడ విజ్ఞానశాస్త్ర పరిచయములేనిదీ ప్రకృతి దృశ్యములను అవలోకించి తన ఆనందమును వర్ణింపలేడు. కాబట్టి వినోద కాల క్షేపములకుకూడ శాస్త్రజ్ఞానము మిక్కిలి అవసరము. ఈ విధముగా జీవితమును సుఖప్రదముగా గడుపుటకై విజ్ఞానశాస్త్రజ్ఞానము ఆవశ్యమని స్పెన్‌సర్ నిరూపించెను. కొంతమంది విజ్ఞానశాస్త్రజ్ఞానము మనుజులను మతదూరులుగా చేయునని అభిప్రాయపడిరి. కాని స్పెన్‌సర్ శాస్త్రము ప్రకృతిలో నిమిడియుండు సౌందర్యమును మానవదృష్టిలోనికి తెచ్చి ఈశ్వరమహిమను వర్ణించుననియు, విజ్ఞానశాస్త్రము మతమునకు విరుద్ధము కాదనియు, మతమువలెనే విజ్ఞానశాస్త్రముకూడ మానవదృష్టిని భగవంతునివైపునకు కేంద్రీకరించుననియు వాదించెను. పై విధమున స్పెన్‌సర్ వాదించి పాఠశాలలలో బోధించవలసిన అంశములన్నిటికంటె విజ్ఞానశాస్త్రజ్ఞానము మిన్నయనియు, కావున ప్రణాళికలో దానికే ముఖ్యస్థాన మివ్వవలెననియు సిద్ధాంతీకరించెను.

(2) మానసిక వికాసము : విద్యాతత్వ శాస్త్రములోని రెండవ అధ్యాయమున మానసిక వికాసమును గురించి వివరించెను. పూర్వకాలమున బాలురను కఠినముగా దండించి విద్యనేర్పెడివారనియు, ప్రస్తుత కాలములో దండనవిషయమై అభిప్రాయభేదములు కలిగెననియు, స్వప్రయత్నమును ప్రోత్సహించుటవలన సంతోషపూర్వకముగా బాలురు దండనముతో బనిలేకయే విద్య నేర్చుకొందురనియు స్పెన్‌సర్ తలంచెను. ఈ కాలమున పలువిధములైన అభిప్రాయభేదములు అభివృద్ధి సూచకములేయనియు, ప్రకృతిలోను కొంత చెడుగు కొంత మంచియు నుండుననియు, మంచినే మనము స్వీకరించవలెననియు స్పెన్‌సర్ తలంచెను.

పెస్టాలొజి సూత్రములలోని మంచిచెడుగులను విచారించి స్పెన్సర్ కొన్నిమార్పులను సూచించెను. పరిశీలనావశ్యకమును దృఢముగా నిరూపించెను. మానసికవిద్యావిషయమై అయిదు సూత్రములను స్పెన్సర్ సూచించెను.

1. సులభమునుండి కష్టమువైపుపోవుట. అనగా మొదట సులభమైనవిషయములను నేర్పి, తర్వాత కష్టమైన విషయములను వాని నాధారముచేసికొని నేర్పవలెను.

2. బాలురకు నిర్వచనము బోధింపకూడదు.

3. నిజవస్తురూపముననుండి గూఢవస్తువులవైపు పోవలెను.

4. బాలురకు స్వయంకృషి అలవాటుచేయవలెను.

5. ఆసక్తి, సంతోషమును పురికొల్పి విద్య బాలురకు నేర్పవలెను.

పెస్టాలొజివలె ఇతడుకూడ విద్యను పసితనమునుండియే ప్రారంభించవలెననెను. పసితనములో పరిశీలనయే విద్యగా పరిగణించవలెను. వస్తుపాఠములకు ప్రాముఖ్యమిచ్చెను. దాని ద్వారా బాలురు శాస్త్రవిషయములను గ్రహించగలుగుదురు. చిత్రలేఖనము బాలురకు నేర్పవలయును. వారికి స్వయంకృషివలన విద్య నేర్చుకొనునట్లు సహాయపడవలెను. విద్యకు ఆసక్తి ఆనందము పునాదిగాచేసి బోధించవలెను. మాంటిసోరి విద్యావిధానమంతయు పైరెంటిపైననే ఆధారపడియున్నది.

(3) నైతికవిద్య :—ఈ కాలపువిద్యలో నైతికవిద్యకు చాలా తక్కువప్రాముఖ్యమివ్వబడెను. దీనికికారణము కొంత వరకు తల్లిదండ్రులే. బాలురకివ్వబడు శిక్షణకూడ అస్వాభావికమై

నది. అనగా ప్రకృతికి సంబంధించినదికాదు. బాలురుచేయు తప్పులకు స్వాభావసిద్ధమైన ఫలము లభించినపుడే వారు తాముచేసిన తప్పులను గ్రహించగలుగుదురు. ఉదా. "బాలుడు దీపమువద్దకు వెళ్ళినపుడు వానిని కొట్టి ఆపుటకంటె ఫలితములను తెలిసికొననివ్వవలెను. వ్రేలుకాలినపుడే దీపముదగ్గఱకు వెళ్ళగూడదను విషయము బాలుడు గ్రహించగలడు. కొట్టి ఆపినందువలన బాలుడు నిప్పువలనగలుగు ప్రమాదముగ్రహించక అనవసరముగా తల్లిదండ్రులపై ఆగ్రహించును. స్వాభావసిద్ధమైన శిక్షపొందినపుడు దానివలన గుణపాఠము నేర్చుకొనును. కాని మిక్కిలి అవసరమైన సమయములందు బాలురను దండించి, నిగ్రహించుట అవసరము. ఉదా. పిల్లవాడు ఇంటిపై భాగమునుండి క్రిందబడుటకు ప్రయత్నించును. దానివలన వానికి తీరనినష్టము వాటిల్లును. అట్టి సందర్భములో తల్లిదండ్రులు బాలురను వారించుట విధి. నైతికాభివృద్ధివిషయమై స్పెన్సర్ కొన్ని సలహాలనిచ్చెను.

1. పిల్లలు ఎక్కువ మంచిస్వభావముగలవారని తలంపరాదు. 2. ఏ విధముగా మానసిక వికాసము క్రమముగా కలుగునో అదేరీతిగా నైతికాభివృద్ధికూడా కలుగును. 3. బాలురను వారి ఇష్టమువచ్చినట్లు చేయనీయరాదు. వారు తప్పుచేసిన మన అయిష్టత, ఆగ్రహము‌ను వెలిబుచ్చవలెను. 4. వారికి పెక్కు ఉత్తరువులీయరాదు. 5. ఇచ్చిన ఉత్తరువులను శిరసావహించునట్లు చేయవలెను. 6. వారిలో మనోనిగ్రహము పెంపొందచేయవలెను. మంచిచెడుగులను గ్రహింపగల శక్తి పెంపొందజేసి స్వేచ్ఛగా నభిప్రాయములను వెలిబుచ్చునట్లు చేయవలెను. 7. అభిప్రాయమును ఆచరణలో పెట్టునట్లు ప్రోత్సహించవలెను. 8. ఉచితమైనవిద్య వారికీయవలెను.

(4) శారీరికవిద్య:— విద్యాతత్త్వములో నాల్గవ అధ్యాయము శారీరిక విద్యనుగురించినది. స్పెన్సర్ శారీరక విద్య

విషయమై ప్రజలుచూపు అశ్రద్ధకు మిగుల వగచెను. ఆరోగ్య శాస్త్రజ్ఞానములేనిది తమ ఆరోగ్యమును కాపాడుకొనుట కష్టము. ఆహారము తక్కువ తీసికొనుటకంటె ఎక్కువ తీసికొనుటయే మంచిది. పిల్లలను వారి ఇష్టమువచ్చినట్లు ఆహారము తీసికొననీయుటవలన ఉపద్రవమురాదు. ఆకలియే ఆహారమును నిర్ణయము చేయును. ఆహారము బలిష్ఠమైనదిగా నుండవలయును. బాలురకు తగినంత ఆహారమివ్వవలెను. దుస్తులు ఎక్కువ వేడిమి కలిగించునవిగా ఉండరాదు. వ్యాయామము బాలురకును బాలికలకును అవసరమనియు, బాలికలకు వ్యాయామావకాశములు లేకుండచేయుట శోచనీయమనియు తలంచెను. మానసిక పరిస్థితుల వలన బాలుర ఆరోగ్యమునకు నష్టము వాటిల్లును. విద్యార్థులు పరీక్షలలో ను త్తీర్ణులగుటకై రాత్రింబవళ్ళు చదివి, తమ శరీరపటుత్వముతోపాటు సౌందర్యమునుకూడ కోలుపోవుదురు. వారు తమ పనులను సామర్థ్యముతో నిర్వర్తించుటకును ఆరోగ్యవంతులుగా నుండుటకును అవసరమగు విద్యను వారి కివ్వవలెను.

**స్పెన్సర్ అభిప్రాయముల విమర్శన :** ఇతని అభిప్రాయముల విషయమై పెక్కు ఆక్షేపణలు చేయబడినవి. విద్యా పరమావధి జీవయాత్రకు బాలురను తయారుచేయుట యని స్పెన్సర్ అభిప్రాయము. విద్యకు ఉద్దేశము జీవయాత్రకు సిద్ధముచేయుట కాదనియు, విద్యయే జీవితమనియు విమర్శింపబడెను. ఈ ఆక్షేపణ కేవలము పదముల అర్థము లేక ఉపయోగమువల్ల కలిగిన భేదాభిప్రాయమని తోచుచున్నది. ఒండొంటి విలువనుబట్టి విషయనిర్ణయము కొంతవరకు అధిక్షేపణకు కారణభూతమగును. విద్యాస్వరూపమును స్పెన్సర్ సరిగా వర్ణించెను. కాని విద్యాస్వరూపము వేఱు. పరస్పరవిషయనిర్ణయము వేఱు. ఈ రెంటిని కలిపి యోజింపరాదు.

విద్య సంపూర్ణ జీవయాత్రకు సిద్ధపరచుటయని చెప్పుచు స్పెన్సర్ లాభకరమైన విద్యకు ఎక్కువప్రాముఖ్య మిచ్చెను. సంపూర్ణజీవయాత్రయను శబ్దార్థమును పూర్తిగా గ్రహించిన యెడల ఈ అధిక్షేపణకు తావుండదు. ఇదిగాక స్పెన్సర్ కేవలము ఉపయోగకరమగు విద్యావిషయములనే చర్చించక మత, నైతిక, వ్యవహారములను గూడ చర్చించుటవలన అతని ఆశయములు ఉత్కృష్టములనియు తోచును.

"స్పెన్సర్"కు స్వకీయమైన ఉన్నతాదర్శములు లేవనియు. రూసో, బేకిన్, పెస్టాలొజి మొదలైనవారి అభిప్రాయములనే వెలిబుచ్చెననియు కొందరందురు. కొంతవరకు ఈ ఆక్షేపణ సరియని తోచును. కాని పైనుదాహరించిన విద్యావేత్తల యభిప్రాయములను పరిశీలించి వాటికన్నిటికిని శాస్త్రీయతను కల్పించి, పరిష్కరించుటయే యతని గొప్పదనము. ఇదిగాక తన పూర్వీకుల అభిప్రాయములన్నిటిని క్రమముగా వివరించి 19వ శతాబ్దికి తగురీతిని వెలిబుచ్చుటయే స్పెన్సర్ ఔన్నత్యము వేనోళ్ళ చాటుచున్నది.

# మాంటిసోరి

## క్రీ. శ. 1870

మాంటిసోరి వృత్తిరీత్యా డాక్టర్. ఆమె వైద్యవిద్య నభ్యసించిన తరువాత నామె దృష్టియంతయు పసిపిల్లల రోగనివారణపై కేంద్రీకరించెను. దానివలన ఆమె పసిపిల్లలకు సాధారణముగా వచ్చునట్టియు ప్రత్యేకమైనట్టియు రోగముల చికిత్సను గురించి సంపూర్ణజ్ఞానము గడించెను. అటుతరువాత నామె సహజలోపములుగల బాలుర విద్యావిషయమై శ్రద్ధవహింపసాగెను. ఆ కాలమున సహజలోపములుగల బాలుర విషయమై పరిశోధన చేయుచున్నట్టి "ఇటార్డ్", "సిగ్విన్"ల. సహాయము పొందెను. పైవారిద్దరు పెక్కు ప్రయోగముల ఫలితముగా బాలుర వ్యక్తిగతమైన శక్తుల పరిశీలించి వారి లోపముల నివారించి అభివృద్ధికి మార్గములను సూచించిరి. ఇటార్డ్ వ్రాసిన గ్రంథము లాసక్తిని పురికొల్పునవియేగాక విద్యనుగురించి పెక్కు ప్రయోగములను వివరించెను. మానసిక విషయములనుగురించి ప్రయోగములు సల్పినవారిలో ఇటార్డ్ మొదటివాడు. ఇటార్డ్, సిగ్విన్‌ల ప్రయోగములు మాంటిసోరి దృక్పథములో మార్పులు కలుగజేసెను. పసిపిల్లల విద్యావిషయమై, వారి రోగముల విషయమై యామె తీవ్రముగా యోచింప నారంభించెను. వారి విద్యాభివృద్ధికొరకు తగు పద్ధతులను కనుగొనుటలో ఆమె కృతార్థురాలయ్యెను. ఆసక్తి వారి విద్యాభివృద్ధికి ప్రధానమైన లక్షణ

మని యామె గ్రహించెను. ఆసక్తి వలననే విద్యాఫలితములు తృప్తి కరముగను స్థిరముగను నుండునని భావించెను. ఇట్టి యాసక్తిని పురికొల్పుటకును నిలుపుటకును నామె యుపయుక్తమగు నాట వస్తువులను సృష్టించెను. అవి యాసక్తిని రేకెత్తించుటయేగాక బాలుర స్వయంకృషిని ప్రోత్సహించును. బాలురు తమ యాట వస్తువులను స్వయముగా నుపయోగించి, వారంతట వారే విద్య నేర్చుకొనగల్గుదురు. పై వస్తువులు పసిపిల్లల మానసికాభివృద్ధికి తోడ్పడును. మరియు ప్రణాళికయొక్క యుద్దేశ్యములనుగూడ నెరవేర్చును. ఈ యాటవస్తువుల నుపయోగించి బాలురు గ్రహించిన విషయము లితర పద్ధతులద్వారా నేర్చుకొనిన విషయ ములకంటె మిక్కిలి యెక్కువగా నుండును. త్వరగా వారు ప్రాథమిక తరగతులలో నుత్తీర్ణులై మాధ్యమిక తరగతులలో ప్రవేశించుట కర్హులగుదురు. ఇట్టి యర్హత బాలురలో కలుగ జేయుటయే "మాంటిసోరి" విద్యావిధానము గొప్పదని నిరూపించు చున్నది.

**మాంటిసోరి విద్యాసామగ్రి:** బాలురకు విద్య నేర్పుటకై యామె నిర్మించిన సామగ్రి "మాంటిసోరి విద్యాసామగ్రి" యనబడును. పిల్లలు స్వయముగా తీసికొనుటకు వీలగుచోట నీవస్తువులుంచబడును. వారికి బల్లలు కుర్చీలివ్వబడును. బాలురకు ఇష్టమైనయెడల క్రింద కూర్చుండవచ్చును. ఉపాధ్యాయులాజ్ఞ లివ్వక సలహాలిచ్చుచుందురు. బాలురు వారి ఇష్టప్రకారము ప్రవర్తింతురు. స్వేచ్ఛయే ఈ విద్యావిధానమందలి ప్రత్యేకలక్షణము. పిల్లలు తమంతటతా మాడుకొనవచ్చును, గాని యితరులకెట్టియాటంకములు కలుగ జేయరాదు. ఈ పద్ధతివలన బాలురు స్వయముగా నితరులజోక్య మవసరములేకుండనే తగు శిక్షణ పొందగలుగుదురు.

విద్యోపకరణముల వివరణములు: మాంటిసోరి యభిప్రాయము ప్రకార మింద్రియ శిక్షణ, స్వేచ్ఛావృత్తి, బాలుర ప్రారంభ దశలో కలుగజేయుటయే విద్యకు ప్రయోజనమై యుండవలెను. స్వయంకృషి యలవడుటయేగాక బాలుర కింద్రియ విచక్షణకూడ తెలియును. ఆమెచేసిన విద్యా వస్తువులన్నియు పై నుదహరించిన గుణముల యభివృద్ధికొరకే యేర్పడినవి. ఆ యుపకరణముల వివరములు గ్రంథవిస్తర భీతిచే వివరింప వీలుకాలేదు. ఆమె రచించినపుస్తకములు తల్లిదండ్రు లకును పాఠశాలకును మిక్కిలి లాభదాయకములు. ఆమె నిర్మిం చిన వస్తుసముదాయము వలన నామె విద్యాసూత్రముల తత్వము బోధపడును.

1. మొదటి ఆటవస్తువు :—వ్యాసములోను ఎత్తులోను భేదములుగల పది వేరువేరు స్థూపములు. నయనేంద్రియ శిక్షణయే వీని యుద్దేశ్యము. ఒక కొయ్యముక్కలో పదిగుంటలు చేయబడి యుండును. బాలుడు వాటిలో సరియైనటువంటి స్థూపమును ఉంచవలెను. ప్రతిస్థూపము తలపైన పట్టుకొనుటకు వీలగునట్లు పిడి గుండివలె నుండును. గుంటలలో పెద్ద చిన్నలను పరికించి స్థూపము లమర్చవలసియుండును. చిన్నగుంటలో పెద్దస్థూపము దిగవేయ ప్రయత్నించినచో బాలురదృష్టిలో దోషమున్నట్లు స్పష్ట మగును. పైనచెప్పినప్రకారము స్థూపములను సరియైన గుంట లలో నుంచుటకు చేయు ప్రయత్నమువలన జ్ఞానేంద్రియమునకు శిక్షణ కలుగును.

2. రెండవ ఆటవస్తువు గోపురాకారము. ఈ ఆట వస్తువు వలన పిల్లలకు వస్తువు పరిమాణము గ్రహించుటకు శక్తి కలుగును. కొయ్యముక్కలతో పిల్లలు గోపురాకారమును చేయనేర్తురు. గోపురమును సిద్ధపరచుటవలన బాలురకు దేహపరిశ్రమ కల్గుటయే గాక వారి జాగ్రత పెంపొందజేయబడును.

3. పొడవునుగురించి జ్ఞానముకలుగ జేయుటకై బాలురకు పొడుగైన కొయ్యముక్క లివ్వబడును. అన్నిటికంటె పెద్దకొయ్య ముక్క పొడవొక మీటర్ అని భావించినచో యన్నిటికంటె చిన్నదానియొక్క పొడవు మీటరులో దశాంశముండును. ఈ కొయ్యముక్కల కెరువును నీలి రంగునువేసి, వానిని దశాంశదూర ములో నుంచుటకు పిల్లలకు సలహాయివ్వబడును. ఈ వస్తువుల నుపయోగించిన బాలురు పదివరకు సంఖ్యలను లెక్కించనేర్తురు. ఇంతేగాక దశాంశముల గురించికూడ జ్ఞానము సంపాదించ గలుగుదురు.

ఇవిగాక మరెన్నియో వస్తువు లామె నిర్మించెను. వాని వలన నితరేంద్రియములకు శిక్షణ కలుగును. వివిధరంగులను గుర్తించుటకై వివిధరంగుల పట్టుదారము లుపయోగింపబడును. స్థూపాకారముగల డబ్బీలు చేయబడి చిన్న చిన్న కంకరరాళ్ళువేసి బాలుర కివ్వబడును. ఆ డబ్బీలను కదల్చుటవలన లేక యుపయో గించుటవలన ధ్వనియగును. అట్టి ధ్వనుల భేదము కనిపెట్టు జ్ఞాన మీ డబ్బీలమూలముగా వృద్ధిపరుపబడును. అందమైన అక్షర ములు చేసిన అట్టలు బాలుర కివ్వబడును. ఆ యక్షరములు కొన్ని బంగారువన్నె గలిగినవిగను, కొన్ని నలుపురంగు గలిగినవి గను, మరికొన్ని తెల్లనివిగా నుండును. వివిధరంగులుగల యక్ష రములను చూచుటకు బాలురు స్వభావసిద్ధముగ నిష్టపడుదురు. అక్షరములను పరీక్షించి వేరు వేరు యక్షరముల స్వరూపమును గమనింతురు. ఈ అక్షరములు మిగుల నందమై యాకర్షణీయ మైన డబ్బీలలో నుంచబడును.

మాంటిసోరి, నిర్మించిన విద్యోపకరణములు దేహపరి శ్రమ కలుగజేయును. కొయ్యచట్టములలో చొక్కాలుంచబడును. ఆ చొక్కాలకు గుండీలు కట్టుటకు త్రాళ్ళుండును. బాలురు చొక్కాకు గుండీలుపెట్టుట, త్రాళ్ళనుకట్టుట పై పనిముట్లవలన

నేర్చుకొందురు. ఇట్టి ప్రయోజనకరమగు నాటవస్తువులద్వారా శిక్షణపొందిన బాలు రితరబాలురకంటె త్వరగా గుండీలు పెట్టుట గాని త్రాళ్ళను కట్టుటగాని నేర్వగలుగుదురు.

ఈ విధముగ మాంటిసోరి జీవితములో బాలురు చేయవలసిన పనులన్నిటికి తగు శిక్షణ ఇచ్చుటకు వలయు సామగ్రినంతయు సృష్టించెను.

**ఫ్రోబెల్, మాంటిసోరి ఆటవస్తువులు:** ఫ్రోబెల్ సృజించిన ఆటవస్తువులు, వృత్తుల నాధారముచేసికొనియే మాంటిసోరి, వస్తువులను నిర్మించినట్లును, వాటికిని వీటికిని భేదము లేనట్టును స్థూలదృష్టికి తోచును. కాని సూక్ష్మదృష్టితోచూచిన రెంటికిని చాల భేదమున్నట్లు స్పష్టమగును. విద్యనేర్పుటలో ఫ్రోబెల్‌కంటె మాంటిసోరి బాలుర స్వయంకృషికి చాల అక్కర కల్పించెను. ఇదిగాక వారికి సంపూర్ణస్వాతంత్ర్యముకూడ ఆమె యిచ్చెను. కిండర్‌గార్టెన్ పద్ధతిలో స్వాతంత్ర్యచ్ఛాయలు మాత్రము గోచరించెను. తరగతిలో విద్యనేర్పు పద్ధతుల ననుసరించియే కిండర్‌గార్టన్ విధానముగూడ నుండును. కిండర్‌గార్టన్ పద్ధతిప్రకార మొక సమయములో నొకే బహుమానముతో తరగతిలోని పిల్లలందరును ఆడుదురు. పిల్లలందరు ఉపాధ్యాయుని ఆదేశము ప్రకారము గోలీలు తీసికొందురు. తరువాత ఆయన ఆజ్ఞప్రకారము వానిని విడిచిపెట్టుదురు. పాటపాడుచు ఒకరి చేతిలోనుండి ఒకరు గోలీలను స్వేచ్ఛగా తీసికొందురు. ఇటుల కొంచెము స్వాతంత్ర్య రేఖలు కాన్పించినను తరగతిఅంతయు మొత్తము పనిచేయుదురు. ఉపాధ్యాయుడు మార్గదర్శిగానుండును. పై అభిప్రాయములకు విరుద్ధముగా మాంటిసోరి పిల్లలకు పూర్తి స్వేచ్ఛనిచ్చెను. స్వయంకృషికిని ఏకాగ్రత చిత్తమునకును ఆమె చాల యెక్కువగా తావిచ్చును. పిల్లలపై ఎట్టి ఒత్తిడిని కలుగ

జేయదు. వారి ఇష్టప్రకారము ఆటవస్తువుల నుపయోగించుటకు పూర్తియైన అవకాశమిచ్చును. దీనికి ఉదాహరణముగ ఆమె తన యనుభవములో జరిగిన ఒక సంగతిని వర్ణించెను. ఒక పిల్లకు ఆటవస్తువు నిచ్చినప్పుడు వాటి నన్నిటిని పగులగొట్టుచుండెడిది. ప్రతి దినము ఇదేరీతిగా ఆపిల్ల చేయుచుండెడిది. కాని మాంటిసోరీ ఎట్టి ఆటంకమును కలుగజేయక ఆ పిల్లకు పూర్తియైన స్వేచ్ఛ నిచ్చెను. కొంతకాలమునకు ఆ బాలిక పగులగొట్టుటమాని ఉపాధ్యాయునితో ఆడుట ప్రారంభించెను. మాంటిసోరి బాలురకు స్వాతంత్ర్యమునిచ్చి స్వకీయమైన ఆసక్తిని ప్రోత్సహించును. బాలురలో తమంతట తామే పనిచేయు ఆసక్తి ఎంతవరకు జనించదో అంతవరకు వారు చేయుపని వారి స్వభావమును నిర్ణయింప జాలదు. జ్ఞానేంద్రియముల శిక్షణకై ఫ్రోబెల్ బహుమానము లను చేసెను. వీటిని నిర్ణయించుట లేక ఎన్నుకొనుటలో గూఢమైన తత్వమును, అర్ధముగాని సూత్రముల నుపయోగించెను. 'మేడం మాంటిసోరి, ఇటార్డ్, సిగ్వన్'లు అభివృద్ధికరములగు ప్రయోగఫలితముగ పరిశీలించి ఏ యే వస్తువులను పిల్లలుపయోగించిన లాభదాయకమో వాటినే నిర్ణయించిరి. మాంటిసోరి చేసిన ఆటవస్తువులలో నవీనకాలపు విద్యాసూత్రములు. పద్ధతులు గోచరించును.

ఉన్నతవిద్య కుపయుక్తమగు సామగ్రి

ప్రారంభమున మాంటిసోరి బాలురకు రేఖాగణితముతో పరిచయము కలుగజేయు కొన్ని వస్తువులను నిర్మించెను. ఆమె కొయ్యచెక్కతో రేఖాగణితపు పనిముట్లు సిద్ధపరచెను. ఆ పని ముట్లు పట్టుటకు వీలైనంత తొలులు ఇతర చెక్కలలో చేసెను. పిల్లలు ఆ రేఖాగణితపు వస్తువులను సులభముగా తొలులలోదింపుటకును ఎత్తుటకును వీలగునట్లు వానికి పిడు లమర్చెను. బాలురు ఆ వస్తువులను తొలులలో దింపుటయేగాక వానిని ఎత్తిన తర్వాత

ఆ తొలులలో వ్రేలుపెట్టి తొలియున్నంతభాగము త్రిప్పుచుందురు. వీనివలన వారి అవయవములకు శిక్షణము గలుగును. బాలురు ఈ రేఖాగణితపు ఆకారములను కాగితముమీదదించి వానిచుట్టు పెన్సిలుతో గీతలు గీయుదురు. కాగితముమీద ఏర్పడిన ఆకారము లలో రంగు నింపుదురు. ఇట్లుచేయుటవలన రేఖాగణిత రూపము లతో బాలురకు పరిచయమగుటయేగాక తొలిలో వ్రేలు త్రిప్పుట వలన గలిగిన అభ్యాసము అక్షరములు నేర్చునపుడు మిగుల సహాయకారిగా నుండును. వ్రాత నేర్చునపుడు పెద్ద పెద్ద అక్షరములలో రంగు నింపుటకు బాలురకు అవకాశ మివ్వబడును. ఈ అక్షరములవద్ద ఆయాయక్షరములతో ప్రారంభమగు మాటయొక్క చిత్రముగూడ ఉంచబడును. పిల్లవాడు అక్షరములమీద వ్రేలుత్రిప్పును. ఇట్లు త్రిప్పుటచే వ్రాతకు మార్గమబ్బును. చేతికి అభ్యాసమగును. జ్ఞానేంద్రియము శిక్షణపొందును. చక్షువులు శక్తివంతములగును. తరువాత బాలురు సీమసున్నముతీసికొని బోర్డుమీదను తలుపులమీదను అక్షరములువ్రాయుట చిన్న మాటలను వ్రాయుట ప్రారంభింతురు. ఈ విధముగ స్వభావసిద్ధమైన శిక్షణను బాలురు పొందుచుందురు. మాంటెసోరి పద్ధతిప్రకారము శిక్షణపొందిన ఐదు సంవత్సరముల వయస్సుగల బాలురు ఇతరపద్ధతులప్రకారము శిక్షణపొందిన 7 సంవత్సరముల బాలురకంటె ఎక్కువవ్రాయుట కలవాటు గలిగి యుందురు. ఇదేవిధముగ గణితము లేక లెక్కపెట్టుట నేర్పబడును. ఎక్కములు జ్ఞప్తియందుంచుకొనునట్లు చేయుటకై ఆమె వస్తురూప ముగా ప్రదర్శనచేయును. గణితములోని ప్రశ్నలు గూఢముగ నుండవు. వస్తురూపమున బాలురు తమలోతామే ఇచ్చిపుచ్చు కొని ఇచ్చిన ప్రశ్నలకు సమాధానమిత్తురు. దీనికొరకై విదేశ నాణెముల రూపములనుగూడ ఆమే సిద్ధపరచెను ఈ నాణెముల నుపయోగించుటవలన బాలురు గణితమును సులభముగ నేర్చు

కొనగలుగుదురు. భూగోళము చరిత్రను బోధించునపుడుగూడ వస్తురూపమున ప్రదర్శించుటకే ఆమె ప్రాధాన్యమిచ్చెను. ఆమె పద్ధతుల నవలంబించుటవలన బాలురు ప్రాథమిక విద్యను అతి సులభముగా పూర్తి చేయగలుగుదురు. తక్కిన పాఠశాలలలో నాలుగు ఏండ్లలో పూర్తియగు విద్య ఆమె పద్ధతుల ప్రకారము 2 ఏండ్లలో పూర్తి కాగలదు. ఆమె పద్ధతి విజయమందుటకు ఇదియే గొప్ప తార్కాణము. మాంటిసోరి పద్ధతికి కేవలము ప్రాథమిక పాఠశాల నిర్వహణములో అగ్రస్థాన మివ్వవలెను. ఆమె పద్ధతి చిరస్మరణీయము.

# జాన్ డ్యూయి

## క్రీ. శ. 1859

ప్రస్తుత కాలములోనున్న విద్యావేత్త లందరిలో జాన్ డ్యూయి మిగుల గొప్పవాడు. పూర్వకాలపు విద్యాభిప్రాయము లకును అతని అభిప్రాయములకును చాల వ్యత్యాసముగలదు. అతని విద్యాభిప్రాయములకు పరిణామవాదము ఆధారము. డ్యూయి అతీతమైన తత్వవేత్తయును విద్యాధురీణుడగుటయేగాక గొప్ప విజ్ఞానశాస్త్రజ్ఞు డనుటకు అర్హుడు. పూర్వకాలపు తత్వవేత్తలవలె కూర్చుండి విద్యాభిప్రాయములను వెలిబుచ్చక విజ్ఞానశాస్త్రజ్ఞుని వలె ఆ విషయములను పరిశోధించి నిజానిజములను తెలిసికొని విద్యాసూత్రములను నిర్వచించెను.

అతని గ్రంథములు

1. పాఠశాల, సంఘము.
2. పాఠశాల, శిశువు.
3. రేపటి పాఠశాలలు.
4. విద్యావ్యాసములు.
5. ప్రజాపరిపాలనము, విద్య.

పై నుదాహరించిన పుస్తకములు చదువుటవలన అతని అభిప్రాయములు గోచరించును.

ప్రయోగపాఠశాల

పారిశ్రామిక విప్లవమువలన ఆ కాలపు సాంఘిక జీవనములో విపరీతమైన మార్పులు గలిగెను. పూర్వపు పాఠశాలలు ప్రస్తుత సాంఘి కావసరములను పూర్తిగా నిర్వర్తించలేవు. ప్రస్తుత కాలపు

బాలుర వాతావరణము విచిత్రమైనది. సిద్ధము చేయబడిన వస్తువులను మాత్రమే వారు చూతురు. నిజవస్తురూపము వారికి తెలియదు. ఒకవేళ తెలిసినను చాల కొద్దివిషయములుమాత్రమే. ఇందుచేత బాలురకు విషయజ్ఞానము, అనుభవము చాల తక్కువ. ఉదా॥ బట్ట ఏ విధముగా తయారగునో బాలురకు వివరములు తెలియవు. కుట్టిన దుస్తులే లభించుట దీనికి కారణము. వండిన ఆహారపదార్థములు బాలురకు లభించుటచేత ముడిపదార్థ స్వరూపము వారలకు తెలియుట కవకాశము లేదు. ఇదేవిధముగా రాత్రులందు ఉపయోగింపబడు వెలుతురెట్లు లభించునో బాలురు ఎరుగరు. వెలిగించుట మాత్రము తెలియును. నేటికి అర్ధ శతాబ్ధము పూర్వమందుండిన బాలురకు వీరికంటె విషయగ్రహణము ఎక్కువగా నుండెడిది. వారు గుడ్డలు ఎట్లు నేయునది, మొక్కలు ఎట్లు పెరుగునది, జంతువులనుండి క్రొవ్వు ఎట్లు తీయబడినది మొదలగు వానినిజూచి జ్ఞానార్జన చేయుచుండెడివారు. ఆ కాలపు విద్య మానసిక, నైతికాభివృద్ధికి తోడుపడుచుండెడిది. బాలురుకూడ గృహకృత్య నిర్వహణములలో పాల్గొనుచుండెడివారు. దీనివలన వారికి తెలియకుండగనే మానసిక, నైతిక శిక్షణ పొందుచుండెడివారు. ప్రస్తుత కాలపు బాలురలో గల లోపములను సవరించుటకుకూడా డ్యూయి, ఒక అభ్యసన శిక్షణా పాఠశాలను స్థాపించెను. బాలురకు సంపూర్ణజ్ఞానము కలుగజేయుటకు వలయు పద్ధతులనుగురించి ఈ పాఠశాలలో కొన్ని ప్రయోగములుగూడ ప్రారంభించెను. డ్యూయి, తననాటి సాంఘిక వాతావరణములో గలిగిన మార్పులను గమనించి అప్పటి ప్రణాళిక పాఠశాలలలో బోధించుట కుపయుక్తముకాదని భావించెను. అందుచేత డ్యూయి, తన ప్రయోగపాఠశాలలో ఆచరణవలన నేర్చుకొనుపద్ధతికి మిగుల ప్రాముఖ్య మిచ్చెను.

ఇదిగాక విద్య సాంఘిక పరిస్థితులకును, అవసరములకును, ప్రయోజనములకును తగినట్లుండవలెనని తలంచెను. సాంఘిక జీవనమును అలవడజేయుటయే విద్యయొక్క పరమోద్దేశమని తలంచి తన అభిప్రాయమునకు ఆచరణరూపమిచ్చుటకే ప్రయోగ ప్రారంభ పాఠశాలను ప్రారంభించెను. డ్యూయి, అతని అనుచరులును ప్రథమమున కొన్ని సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చెను.

1. ఇరుగుపొరుగుననుండు వాతావరణ పరిస్థితులు పాఠశాలలోనికి ఎట్లు ప్రవేశపెట్టవలెను.

2. శాస్త్రము, చరిత్ర, కళలు, ఏ పద్ధతి ప్రకారము బోధించిన జీవితములో వానివలన ప్రయోజనము కలుగును.

3. చదువుట, వ్రాయుట, గణితమును ఏ పద్ధతి ప్రకారము బోధించిన అనుభవమునకును వృత్తికిని సహాయపడును. ఆసక్తిని పురిగొల్పు ఇతర విషయములకును పై నుదాహరించిన వానికిని ఎట్లు సంబంధము కలుగజేయవలయును.

4. వ్యక్తిగతమగు శక్తులు అక్కరలయెడ శ్రద్ధ వహించు టెట్లు.

పెస్టాలొజివలెనే డ్యూయికూడ పాఠశాల ఆదర్శప్రాయమగు ఇంటివలె నుండవలెనని తలంచెను. పిల్లలు తమ తమ సాంఘిక పరిస్థితులను అనుసరించి అభివృద్ధి చెందుదురు. తల్లిదండ్రులు తెలివితేటలు గలవారైన వారి పిల్లలకొరకై తగువస్తువులను సంపాదింతురు. పాఠశాలలుకూడా పెద్ద సంసారముల వంటివి. పిల్లలు సంసారములోని వ్యక్తులవంటివారు. ఇంటిపనులు నిర్వర్తించిన తర్వాతనే పాఠశాలలలో చేయవలసినపనులు క్రమముగా బాలురు గ్రహించవలెను. రెంటికి భేదమున్నదని వారు తలంచ

రాదు. అప్పుడే బాలురు పాఠశాలను ఇల్లని భావించి ఇంటిలోనే పనులుచేయ మొదలిడుదురు. తమసంసారములోని వ్యక్తులుగా తమ్ము ఎంచుకొన్నట్లే సంఘములోని వ్యక్తులమనికూడ గ్రహించి సాంఘిక విధులను నిర్వర్తించుచు సంఘమే తమ జయమునకు కారణభూతమని నమ్ముదురు. డ్యూయి స్థాపించిన ప్రయోగపాఠశాల యీ సంకల్పసిద్ధికై ఏర్పడినది. ఈ పాఠశాలలలో మూడు శాఖలు గలవు.

1. మొదటిశాఖ కొయ్యతో పనిచేయుట, మరియు పనిముట్లు సిద్ధపరచుట.

2. రెండవది వంటపని.

3. మూడవది నేతపని—నిర్వర్తించుచుండెడివి.

ఈ పాఠశాలలో బాల బాలికలు కలిసి పనిచేయుదురు. ఉపాధ్యాయుడు ఏమియు చూపడు. పిల్లలే అతని సలహాలను తీసికొందురు. అతడు వారు కోరిన సలహాలను మాత్రము ఇచ్చును. ఉపాయములను సూచించును. పనియంతయు కొంచెము యించుమించుగా పిల్లలే చేయుదురు. ఈ ప్రయోగములవలన బాలురు తమంతట తామే కొన్ని విషయములను కనుగొందురు. కావలసిన పనిముట్లను సిద్ధపరచగలుగుదురు. కొంతమంది పిల్లలు కొన్ని పటములను, మాదిరులను సిద్ధముచేయుదురు. ఈ విధముగా ఆచరణవలన పెక్కు విషయములను వారు గ్రహించగల్గుదురు. వారిలో బాధ్యత, జ్ఞానము అభివృద్ధిచెందును. సాంఘికక్షేమము అప్రయత్నముగా వారి కలవడును.

ఉదా. బాలురముందు బట్టను సిద్ధపరచు సమస్య యున్నదనుకొనుడు. దానిని నేయుటకు వలయు ప్రత్తి లేక యున్ని వారి కివ్వబడును. బాలురు వాటిని తీసికొని పరీక్షింతురు. అనుభవముచేత ప్రత్తికంటె ఉన్నిని సులభముగా వాడవచ్చునని

వారు గ్రహింతురు. తమ పనిని సులభముగా నిర్వర్తించుటకు కావలసిన పనిముట్లను చేయుదురు. తర్వాత బట్టలను నేయు పద్ధతిని గురించి ఆలోచింతురు. బట్టలనేతను గురించి నేర్చుకొను నపుడు బాలబాలికలు చరిత్ర, విజ్ఞానశాస్త్రము, ఇతరకళలు నేర్చుకొందురు. ఎట్లన, ప్రత్తిని పరిశీలించునపుడు అది పెరుగు స్థలములను పరిస్థితులను తెలిసికొందురు. అనగా భూగోళమువైపు దృష్టి త్రిప్పుదురు. నేత నేయవలసి వచ్చినప్పుడు యంత్రము లుపయోగింతురు. వానిద్వారా విజ్ఞానశాస్త్రజ్ఞానము సంపాదింతురు, యంత్రముల కనుగొనినవారి చరిత్రను తెలిసికొందురు. ఈ విధముగా ఒక పనిని నెరవేర్చు సందర్భములో పెక్కు విషయముల గురించి స్వల్పముగా విషయజ్ఞానమును అప్రియత్నముగా సంపాదింతురు. ఆ విషయములలో వారికి ఆసక్తి జనించును. వంటను నేర్చుకొనునపుడు రసాయనశాస్త్రమును గురించి కొన్ని సంగతులు నేర్తురు.

**డ్యూయి విద్యాప్రణాళిక, మానసిక తత్వము గురించిన అభిప్రాయములు :** ప్రయోగ పాఠశాలలలో ఆచరణ జ్ఞానమునకు అవశ్యకమైనపనులుమాత్రమే నేర్పబడుననియు, విషయజ్ఞానము బాలురకివ్వబడదనియు తలంచరాదు. ఈ పాఠశాలలోని పని ఒక ప్రత్యేక పద్ధతి ప్రకారము నేర్పబడును. బాలుర మానసిక క్రమాభివృద్ధిని లక్ష్యమందుంచుకొందురు. డ్యూయి, ప్రయోగపాఠశాలలోని జీవిత విధులను మూడు దశలుగా విభజించెను.

1. మొదటిదశ 4 నుండి 8 సంవత్సరములవరకు.
2. రెండవదశ 8 నుండి 12 సంవత్సరములవరకు.
3. మూడవదశ 12 సంవత్సరములకు మించిన వారలకు,

4 నుండి 8 సం॥ వయస్సుగల పిల్లలు ఆటలలో నిమగ్నులై యుందురు. రెండవదశలోని పిల్లలకు సహజమైన శ్రద్ధయుండదు. మూడవదశలోని బాలురలో శ్రిద్ధ కల్పింపవచ్చును.

మొదటిదశలోని బాలురు ఇంటిపనులను పరిశీలింతురు. దీని చివరభాగమున కొన్ని నూతన కల్పనలను గురించి తెలిసి కొందురు. దీనితోపాటు చదువుట వ్రాయుట ప్రారంభింతురు. భూగోళజ్ఞానము కొంత సంపాదింతురు. ఈ దశలో పనియంతయు ఆటలద్వారానే నేర్చుకొందురు. రెండవ దశలోని బాలురు కార్య కారణసంబంధములు గ్రహింతురు. ఈ దశలోనేర్చు పనులన్నియు సాంఘిక కార్యములవలె నుండును.

భూగోళము మరియు నితర విషయములు ప్రయోగముల ద్వారా నేర్చుకొందురు. మూడవ దశలోని బాలురు స్వంతముగా సమస్యలను ఎన్నుకొని వానిని దీర్ప శక్తిగలిగియుందురు.

డ్యూయి ప్రణాళిక లేక కార్యక్రమములో ఆచరణకు ప్రాధాన్యమిచ్చుటయేగాక మానసిక దృక్పథమునకుగూడా సమాన మైన ప్రాముఖ్య మివ్వబడెను. అతని మానసిక తత్వమునకును ఇతర విద్యావేత్తల మానసికతత్వమునకును భేదముగలదు. అతని మానసికతత్వము ఇదివరకు మనము నేర్చినట్లు క్రమాభివృద్ధి సూత్రము ననుసరించియుండును. ఇతర మానసిక తత్వవేత్తల వలె అతడు మనస్సును స్థిరమైనట్టియు మార్పుచెందనట్టియు వస్తువుగా భావింపడు. క్రమాభివృద్ధి సూత్రప్రకారము మనస్సుకూడా మార్పుచెందునని డ్యూయి అభిప్రాయపడి దానికి తగినట్లు ప్రణాళిక లేక కార్యక్రమమునుగూడా నిర్ణయించెను. అతడు రచించిన "పిల్లవాడు, ప్రణాళిక" అను పుస్తకములో బోధించవలసిన విషయములనుగురించి బాగుగా చర్చించెను. ఈ సందర్భములో అతడు మనస్సు సాంఘికవస్తువనియు, అది సంఘమునకు లోబడివదనియు

కాబట్టి దాని యభివృద్ధి సాంఘికపరిస్థితులు లేక వాతావరణమును బట్టి యుండవలెననియు అతడు భావించెను. ఇందుచేతనే అతడు విద్యాప్రణాళిక సంఘపరిస్థితుల కనుగుణముగా నుండవలెనని తలంచెను. ఈ విధముగా ప్రణాళికకును బాలునికిని సంబంధ మేర్పడును. ఆ కారణముచేత నేర్చుకొనుటకు ఎట్టి ప్రేరేపణము అవసరముండదు. బాలునిలో సహజాసక్తి గోచరించును. పైవిధముగ డ్యూయి, ప్రపంచమునకు ఒక క్రొత్త ఆదర్శమును ప్రదర్శించెను. దీని ప్రాముఖ్యము ప్రయోగపరిశీలనములవల్ల ముందు ముందు మరింత స్పష్టపడగలదు. అతని మానసికతత్త్వము ఇతరుల అభిప్రాయములను మూలకు తోసెను. క్రొత్త యుగములో ఆచరణ అభిప్రాయముకంటె మిన్నయని ధ్రువపడగలదు. కేవలము ఆచరణకు ప్రాముఖ్యమిచ్చి జ్ఞానార్జనము చేయకుండుటకూడ యవివేకము. కర్మజ్ఞానముల సమన్వయమే విద్యకు ముఖ్యప్రయోజనము. ఈ రెంటికి ప్రాధాన్యమిచ్చుటకై కొన్ని పనులను నియోగించెను. ఈ పనులన్నియు సాంఘికజీవనముతో సంబంధముగలవి. ఉదా. కొయ్యపని, వంటపని, నేతపని. పై పనులను చేయుటవలన ఆచరణకును సిద్ధాంతమునకును సంబంధ మేర్పడును. పై నుదాహరించిన పనులవిషయమై కొన్ని సమస్యలు బైలుదేరును. వాటిని దాటుటకై క్రొత్తవస్తువు లుపయోగింపవలసి వచ్చును. దానివలన నా పనులు ఆసక్తి పురిగొల్పునవిగానుండి ప్రయోజనకరములుగా నుండును.

**సమస్యాపద్ధతి**

డ్యూయి పద్ధతులలో రెండవదగు సమస్యా విద్యాపద్ధతి కూడ ప్రసిద్ధము. ఈ పద్ధతి నతని శిష్యులు అమెరికా పాఠశాలలలో ప్రారంభించిరి. ఈ పద్ధతి నాచరించుటలో నుపాధ్యాయుడు, శిష్యులకు బహుస్వల్ప సహాయముచేయును. అతడు బాలురకు ఒక సమస్యను లేక పనిని నిర్ణయించును. తర్వాత ఆ సమస్యను నిర్వర్తించుటకు బాలురు

